*Issued*: 15-2-55.




# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## MONDAY, 15TH MARCH 1954

## VOLUME V, No. 5

*CONTENTS*



PRINTED FOR ANDHRA GOVERNMENT PRESS
BY SRI RAMA PRINTING WORKS, NELLORE
1955

PRICE 6 annas

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

Monday, the 15th March 1954.

The House met in the Assembly Hall, Kurnool, at eleven of the clock, Mr. Speaker (the Hon. Sri N. Venkatramaiya) in the Chair.

## QUESTIONS AND ANSWERS

### STARRED QUESTIONS.

*Report of the Advisory Committee on the Division of Madras State.*

*291 Q.-Sri PILLALAMARRI VENKATESWARLU:- Will the Hon. the Chief Minister be pleased to state whether the Government will place the report of Advisory Committee in connection with the division of Madras State into Andhra and Residuary Madras State ?

The Hon. Sri T. PRAKASAM :— There is no such report, Sir.

Sri PILLALAMARRI VENKATESWARLU :— Report ఏమీా లేదని తెలియజేశారు. ఆ Committee వారు చేసినటువంటి విషయములన్నీ ఒక report రూపంలో తయారుజేశారా? దానిని ఈ సభముందు పెట్టడానికి తయారుగావుందా ? లేకపోతే ఎప్పుడైనా పెట్టడానికి ఆలోచిస్తారా ?

The Hon. Sri T. PRAKASAM :— తయారైనపుడు తప్పకుండా పెడతాము.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ప్రభుత్వంవారు report తయారుచేసి ఈ శాసనసభముందు పెడతారా ?

The Hon. Sri T. PRAKASAM :— తయారుచేసి, తయారైన తరువాత శాసనసభముందు పెడతామని చెప్తున్నాను.

Sri C. V. K. RAO :— Assets and liabilities విభజన ఏ కార్యక్రమంలో, ఏ పద్ధతిలో, ఏ విధంగా జరిగిందో ఆ విషు

యములతో, అన్నివివరములతో ఒక ప్రత్యేక report ను తయారు చేసి శాసనసభ్యులముందు పెడతారా అని అడుగుతున్నాను.

The Hon. Sri T. PRAKASAM :— చేయవలెననే ఆలోచనలో మేము ఉన్నాము. తయారైనపుడు సభముందు పెడతాము.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— అధ్యక్షా, ఈ Committee సమావేశమైనపుడల్లా minutes అన్నీ record చేశారనుకుంటాను. ఆrecord అయిన minutes వుంటే అదే report అవుతుంది. ప్రత్యేకమైన report ఏమీ అవుసరంలేదు. Record అయిన minutes అన్నీకూడా ఈ సభముందు పెడతారా ?

The Hon. Sri T. VISWANATHAM :— ముఖ్య మంత్రి గారు యిపుడు చెప్పినటువంటిది, ఆ minutes అన్నీతీసి ఒక సమగ్రమైన report గా చేసి శాసనసభ్యులముందు పెడతాము.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— ఇది చాలా ప్రధానమైనసమస్యకాబట్టి, దానిలోని విషయాలను త్వరగా తెలుసుకోవాలి. కనుక వాటిని త్వరగా తెలుసుకొనడానికి ఆరిపోర్టును ఎపుడు యీ సభముందు పెడతారు ? Time limit అడుగుతున్నాను?

The Hon. Sri T. VISWANATHAM :— ఆ విషయాలన్నీ కూడా మన ఆంధ్రరాష్ట్రం వచ్చిన 1-10-53 తారీఖువరకు మాత్రమే సంబంధించినవి. Assets and liabilities కు, ఆ Committee report కు ఏమీ సంబంధంలేదు. Assets and liabilities తో యీ కమిటీకి యెటువంటి ప్రసక్తిలేదు. అక్కడి ఉద్యోగస్థులను ఇక్కడికి తెచ్చుకోటం మొదలైనటువంటి విషయాలుగురించి, రెండు గవర్నమెంటులయొక్క representatives కలిసికూర్చుని ఆలోచించి ఇద్దరి అభిప్రాయాలు సమన్వయపరచుకోవడం, వాటిప్రకారం ఏర్పాట్లు చేసుకొనడంతప్ప, అంతకంటె ఆ Committee కి ఏమీ సంబంధం లేదు. అయినా మీరు ముఖ్యమంత్రిగారిని ఆ రిపోర్టుకావాలని అడిగారు, ఆయన యిస్తానన్నారు. అది తయారైన తరువాత మీ అందరికి సమర్పిస్తాము.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :—Time limit అడుగుతున్నాము ? ఎప్పుడు అందజేస్తారు ?

The Hon. Sri T. VISWANATHAM :— చాలా time అవసరం వుండదు. చాలా చిన్నపనే. 2, 3 నెలలలోగా అయిపోతుంది.

*Improvements to the Minor Ports.*

* 292 Q.—Sri K. KRISHNA RAO :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state further to the answers to question No. 89 dated 6-11-1952 (starred) of the Madras Legislative Assembly, the improvements so far made to the minor ports named in the question and the proposals for further improvements sanctioned for execution ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

Details regarding the improvements made to the three minor ports referred to in the previous question and the improvements proposed to be made are furnished below :—

I. Masulipatam.

Improvements made since November 1953.

| | |
|---|---|
| 1. Purchase of a generator for a signalling cabin | Rs. 1,150 |
| 2. One signalling lamp. | 250 |
| 3. One transformer for the lamp. | 150 |

Improvements proposed.

| Work | Estimate |
|---|---|
| (1) Dredging the bar channel. | Rs. 1,50,000 |
| (2) Electrification of wharves. | 15,000 |
| (3) Construction of a signal cabin. | 1,500 |

II. Kakinada.

| | |
|---|---|
| Improvements made since November 1952. | Nil. |

Improvements proposed to be made.

| Works | Cost |
|---|---|
| (1) Repairs and replacement of timber jetties. | 2,00,000 |
| (2) Reconstruction and improvement of workshop | 75,000 |

III. Bheemunipatnam.

| | |
|---|---|
| Improvements made since November 1952. | Nil. |
| Improvements proposed to be made. | Nil. |

Sri K. KRISHNA RAO:—అయ్యా, దీనిలో కొన్ని కొన్ని minor ports ను, అనగా భీమునిపట్టణం కళింగపట్ణాం పోర్టులను minor ports category నుండి తగ్గించారు. అట్టి భీమునిపట్టణం కళింగ పట్టణం మొదలైన పోర్టులను minor ports గా పరిగణించుతారా? వాటి అభివృద్ధికి, repairs కు ప్రభుత్వం ఎట్టి చర్యలు తీసికుందో చెబుతారా?

The Hon. Sri N. SANJEEVA REDDI:— ఇప్పుడు వున్న minor ports యొక్క అభివృద్ధికి పనులు జరుగుచున్నవి. అవి అయిన తరువాత సాధ్యమైనంత త్వరలో మిగతా minor ports ను develop చేయడం జరుగుతుంది.

Sri C. V. K. RAO:— కాకినాడ minor port కు సంబంధించి నంతవరకు, గవర్నరుగారు, విశ్వనాథంగారు, వచ్చి దానిని పరిశీలించారు. వారు పరిశీలించి ఏమైనవిషయములు Government కు తెలియజేశారా తెలియజేస్తే ఎంతమటుకు చర్యలు తీస్కుకొన్నారు?

The Hon. Sri N. SANJEEVA REDDI:—తెలియజేశారు. దీనిపైన చర్యలు తీసుకొంటున్నాము.

Sri L. LAKSHMANADAS:— అధ్యక్షా! శ్రీకాకుళం జిల్లాలో చాలా ముఖ్యమైన కళింగపట్టణం port ను బాగుచేయించడానికి, repairs చేయించడానికి వెంటనే ప్రభుత్వం ఏమైనా చర్యలు తీసుకుంటారా?

The Hon. Sri N. SANJEEVA REDDI:- ఈ విషయంలో కూడా ప్రభుత్వం చర్యలు తీసుకుంటారు.

Sri D. RAMABRAHMAM:— అధ్యక్షా! చిత్తూరుజిల్లాకు సమీపంలో ఉన్న నెల్లూరు జిల్లాలో ఒక పోర్టును నిర్మించుటకు అవకాశాలున్నాయి. ఈ విషయమై ప్రభుత్వంవారు ఆలోచించుతారా?

The Hon. Sri N. SANJEEVA REDDI:-Port Officer గారితో ఈ విషయము గురించి ఆలోచించుతాము. ఈ విషయమై పరిశీలిస్తాము. దీని విషయమై ప్రత్యేకంగా అడిగితే చెప్తాను. అన్ని పోర్టుల గురించి, ప్రతిదాని గురించి, అడిగితే అన్నీ ఆలోచిస్తామని చెప్పవలసి వస్తుంది.

Sri T. NAGI REDDI:—అధ్యక్షా! భీమునిపట్టణం port ను గురించి ప్రభుత్వం ఏమీచర్యతీసుకోలేదు. ఇప్పట్లో తీసుకోదలచుకోలేదని చెప్తున్నారు. భీమునిపట్టణం ప్రాంతంలో sand dunes వచ్చి, భీమునిపట్టణం గ్రామానికే ప్రమాదపరిస్థితి ఏర్పడుతోంది. అందుచేత ఆ భీమునిపట్టణం port అభివృద్ధికి, sand dunes విషయంలో తగిన చర్యలు తీసుకుంటారా? అని అడుగుతున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI:—Port కు sand dunes కు ఏమీ సంబంధం లేదనుకుంటాను. ఈ sand dunes, విషయమై మునిసిపాలిటీవారు చర్యలు తీసుకోవాలి. భీమునిపట్టణం మునిసిపాలిటీవారు ఈ sand dunes విషయమై చర్యలు తీసుకొంటున్నట్లు Commissioner గారి ద్వారా తెలిసింది. Municipality వారు సరైన చర్యలు తీసుకుంటున్నారని ఆశిస్తున్నాను.

Sri M. VEERABHADRAM:-విశాఖపట్టణం harbourలో ప్రస్తుతం over crowded గా ఉంది. అచ్చటికి ships వస్తే అవి 2 రోజులు, 3 రోజులు సముద్రంలోనే ఉండవలసి వస్తోంది. ఇటువంటి పరిస్థితిలో భీమునిపట్టణం port ను develop చేయడానికి ప్రభుత్వం ఆలోచిస్తారా?

The Hon. Sri N. SANJEEVA REDDI:— కాకినాడ, మచిలీపట్నము, పోర్టులను తక్షణమే అభివృద్ధి చేయుటకు ఆలోచిస్తు

న్నాము. భీమునిపట్టణం port ను develop చేయడం విషయంకూడా ఆలోచనలో ఉంది.

Sri B. LAKSMINARASA RAJU:-ఇప్పటికే నరసాపురం నుంచి కొబ్బరి, ధాన్యం ఎగుమతి అవుతోంది. ప్రత్యేకంగా దాన్నిగురించి శ్రద్ధ తీసుకుంటారా?

The Hou. Sri N. SANJEEVA REDDI:— ఇక్కడ కొబ్బరి ఎగుమతి అయితే మరొకచోటనుంచి మరొకటి ఎగుమతి అవుతుంది. అన్ని సమగ్రంగా ఆలోచించి ఏది ముందు, ఏది వెనుక అనేది ఆలోచించుకోవాలి.

Sri G. ANJANEYULU:—బందరు రేవుగురించి ఎదో బాగా చేసాము అని మంత్రిగారు చెప్పారు. బందరురేవు ప్రాముఖ్యత గురించి మంత్రిగారికి తెలుసుననుకుంటాను. ఇనుము మొదలైనవి ఇతర దేశాలకు యీ .రేవుద్వారానే ఎగుమతియై వెళ్ళిపోతున్నాయి. అది చాలా ముఖ్యమైన రేవుగా వున్నది. అఖండ గోదావరి అనే డ్రెడ్జరు వచ్చేవరకు పని చేయడానికి వీలులేదని అచ్చటి అధికార్లు చెప్పారు. ఇంతవరకు అఖండ గోదావరి రాలేదు. అఖండ గోదావరిని తెప్పించి తొందరలో మంత్రిగారు బాగు చేయించడానికి చూస్తారా? అక్కడ ఒక డ్రెడ్జరు యెప్పుడు నిల్వయుంచుతారా?

The Hon. Sri N: SANJEEVA REDDI:— బాగుచేసిందెదో చెప్పాను. అఖండగోదావరి తేవడానికి ఖరీదు ఎక్కువవుతుంది. ఇక్కడే డ్రెడ్జరుచేత చేయించమని సలహా ఇచ్చారు. దాన్ని పాటించడానికి సిద్ధంగా వున్నాము. కొంత తక్కువ ఖరీదుతో చేద్దాం అని చూస్తున్నాము,

Sri T. POTHARAJU:—బందరు రేవు విషయంలో cannal డ్రెడ్జ్ చేయడానికి, electrification కు propasals వున్నాయిఅన్నారు. దానికి ఏమాత్రం ఖర్చు అవుతుంది? దానికి ఈ సంవత్సరం బడ్జెటులో ఏమైనా allot చేసినారా? విశాఖపట్నం హార్బరులో వుండే డ్రెడ్జరును తెప్పించి బాగుచేయించ గలరా?

The Hon. Sri N. SANJEEVA REDDI :—Cannal డ్రెడ్జు చేయడానికి, లక్షా 50 వేలు అవుతుంది. electrification కు 15 వేలు అవుతుంది, construction of a signal కు 1500 అవుతుంది. దీన్ని వెంటనే తీసివేయడానికి వీలులేదు. బడ్జెటులో లేకపోయినా, machinery దొరికి నపుడు దానిని కొని పని పూర్తిచేయవచ్చును.

Sri SAKA VENKATA RAO:ముందు, వెనుక అని అన్నారే ఏది ముందో, ఏది వెనుకో చెబుతారా?

The Hon. Sri N. SANJEEVA REDDI:—Separate question వేస్తే చెబుతాను.

Sri VAVILALA GOPALAKRISHNAIAH:—వాడరేవు, కొత్తపట్నం విషయం ఆలోచిస్తారా? రంగూను వెళ్లేవాళ్లు, విశాఖపట్నంలో ఓడ ఆగకుండా వుండడం మూలాన, మద్రాసుగాని, కలకత్తాగాని వెళ్ళవలసివస్తోంది. రోజులకొలది కలకత్తాలోను, మద్రాసులోను వుండిపోవలసివస్తోంది. అందుచేత రంగూను వెళ్లేవాళ్లు చాలా బాధ పడుతున్నారు. అందుచేత విశాఖపట్నంలో స్టీమరు ఆగే ఏర్పాటు చేస్తారా?

The Hon. Sri N. SANJEEVA REDDI:—I do not know how it is relevant to minor ports. అయినా వారు ఇచ్చిన information కు thanks. దాన్ని గురించి ప్రత్యేకంగా అడిగితే, depart ments కు పంపించి ఆలోచన చేయిస్తాము.

Sri P. PUNDARIKAKSHACHARYULU:— కొన్ని రేవుల గురించి ఆలోచన చేశామని, కొన్ని రేవులగురించి చేయలేదని చెప్పారు. ఈ విషయంలో minor ports list ఏ మైనా వున్నదా?

The. Hon. Sri N. SANJEEVA REDDI:-List గా కావాలంటే ప్రత్యేకమైన ప్రశ్న వేస్తే ఇప్పిస్తాము.

Sri P. KOTAIAH:—వాడరేవు అభివృద్ధిచేయడానికి చాలా తక్కువ వ్యయం అవుతుందని, అందుచేత తొందరలో చేయించాలి అని

చాలా విజ్ఞప్తులు వచ్చాయి. దానికి గురించి వివరంగా చెప్పడానికి వీలు వుంటుందా?

The Hon. Sri N. SANJEEVA REDDI:— అనేకమైన విజ్ఞప్తులు వచ్చినమాట నిజమే. ఏమిజరిగింది అనే దానికి ప్రత్యేకమైన ప్రశ్నవేస్తే చెబుతాను.

Sri A. NEELADRIRAO REDDI:— బారువరేవు గురించి చెప్పలేదు. అది list లోవున్నదా? దాన్ని అభివృద్ధిచేసే విషయంవుందా?

The Hon. Sri N. SANJEEVA REDDI:— ఇప్పుడు ఆలోచనలో వున్నా లేకపోయినా, మీరు చెప్పారు, కాబట్టి, ఆలోచించడం మొదలుపెడతాము.

*Well Subsidy scheme in Rayalaseema*

* 293 Q.—Sri K. KRISHNA RAO:— (Put the question on behalf of Sri T. Lakshminarayana Reddi):- Will the Hon. the Minister for Land Revenue be pleased to state whether the Government have any proposal to revive well subsidy scheme in Rayalaseema ?

The Hon. Sri K. KOTI REDDI :— The proposal is under consideration..

Sri R. SIDDANNA GOWD :— ఈ స్కీముక్రింద బావులు త్రవ్వించే వాయిదా అయిపోయింది. మూడు సంవత్సరాలనుంచి క్షామంవల్ల, గడచిన సంవత్సరం విశేషవర్షంవల్ల నిలిచిపోయాయి. దానికి వాయిదా యిప్పిస్తారా ?

The Hon. Sri K. KOTI REDDI :— దానికి దీనికి సంబంధం లేదు. అయినా instructions పంపించాము. ఈ సంవత్సరం జూన్ నెలాఖరువరకు వాయిదా బాకీలు వసూలుచేయకుండా instructions పంపించాము.

*Diet to Prisoners.*

* 294 Q.—Sri K. PATTABHIRAMAIAH :— Will the Hon. the Minister for Finance and Law be pleased

15th March 1954 ]

to state the diet given to prisoners accustomed to milk, fruit and other natural diet and in what quantity ?

The Hon. Sri T. VISWANATHAM :— Prisoners are given diet in accordance with the class to which they belong and the scale of diet prescribed for that class under the rules and not with reference to the diet to which they are accustomed to.

ఖైదీని ఏ తరగతిలో వేస్తారో, ఆ ఖైదీకి రూల్సుప్రకారం ఏ ఆహారం నిర్ణయిస్తారో అదే పెడతారు. వారికి మామూలు అలవాటుగా వున్న భోజనం అనికాదు.

Sri G. SATYANARAYANA :— కొంతమంది ఖైదీలకు ప్రకృతి ఆహారం తినే అలవాటు వుంటుంది. వాళ్ళకు వీలైన పండ్లు, పాలు తెప్పించి యివ్వటానికి ప్రయత్నిస్తుందా ?

The Hon. Sri T. VISWANATHAM :—క్రొత్తగా వచ్చింది కాబట్టి ఆలోచించాలి.

Sri LAKSHMINARASA RAJU :— ప్రకృతి ఆహారం తినేవారికి వీలైన ఆహారం యిదివరకే బ్రిటిషు ప్రభుత్వంవారు కూడా యిచ్చేవారు. ఈ ప్రభుత్వంకూడా అలాంటి సాంప్రదాయాన్ని అమలు పరుస్తారా అని అడుగుతున్నాను.

The Hon. Sri T. VISWANATHAM :— ఇదివరకు ఎలాంటి అలవాటుఅంటే, డాక్టరు advice పైన యిచ్చేవారు. అది యిప్పుడూ జరుగుతూనేవున్నది. ఈక్లాసులకు వుండే diet లలో ప్రకృతి diet కూడా నిర్ణయించాలంటే, అది ఆలోచించాలి.

Sri C. PRABHAKARA CHOWDARY :—ఇపుడు ఉండే జైలుడాక్టర్లు న్యాచురోపతికి వ్యతిరేకం. అందుచేత వాళ్ళు సాధారణంగా అనుమతి యివ్వడంలేదు. అందుచేత ఆ డాక్టర్ల సర్టిఫికేట్లమీద ఆధారపడకుండా వుంటారా ?

The Hon. Sri T. VISWANATHAM :— చౌదరిగారికి ప్రకృతిలో అంత నమ్మకంవున్నదని నాకు తెలియలేదు. ప్రకృతి ఆహారం మీద conscientions గా వున్నవారికి తగు యేర్పాట్లు చేయడానికి యత్నం చేస్తాము.

Sri Ch. S. R. V. P. MURTHI RAJU :— ఇక ముందు జైళ్ళలో opposition వాళ్ళు వుంటారో, ఎవరు వుంటారో తెలియదు. కాబట్టి diet గురించి ముందే జాగ్రత్తపడేటట్టు చేస్తారా ?

The Hon. Sri T. VISWANATHAM :— చాలా చమత్కారంగావున్నది. కాని యిది ప్రశ్నకాదు. జవాబు అక్కరలేదు అనుకుంటాను.

Sri T. NAGI REDDI :—Prisoners కు ఇచ్చే diet గురించి Jail Reforms Committee ఏమైనా చెప్పిందా ?

The Hon. Sri T. VISWANATHAM :— Jail Reforms Committee examine చేసింది. Calories సరిపోతుంది, Vitamins తక్కువ అనిచెప్పింది. 6 ounce ల vegetables లో 4 ounce లు leaf vegetable వుంటే చాలు అన్నారు. ఆ ప్రకారం instructions యిచ్చాము.

Sri SAKA VENKATA RAO-:Ounces లెక్క బాగానే వుంటుంది. అదిఅంతా ఖైదీలకు సరిగ్గా ముట్టకుండా వున్నసంగతి ప్రభుత్వానికి తెలుసునా ? ఆ విషయంలో తగుచర్య తీసుకుంటారా ?

The Hon. Sri T. VISWANATHAM :— రిపోర్టులమీద ఆధారపడే ప్రభుత్వంకాదు. అంతా మనకు అనుభవంలో తెలిసిన విషయమే. ఈ విషయంలో తగు చర్యతీసుకుంటూనే వున్నాము.

Sri C. V. K. RAO :—ప్రభుత్వం జైళ్ళలో ప్రకృతి ఆహారంతినే వాళ్ళకు పెట్టలేము అంటున్నారు. ప్రకృతి ఆహారం తినేవాళ్ళను జైళ్లలో పెట్టముఅని హామీ యిస్తుందా ?

The Hon. Sri T. VISWANATHAM:— ప్రకృతి ధర్మం ప్రకారం వెళ్ళేవాళ్ళరు జైళ్ళల్లో పెట్టవలసిన అగత్యమే లేదు అను కుంటాను.

Sri PILLALAMARRI VENKATESWARLU:— Jail Reforms Committee సభ్యులు జైలు అనుభవంలేనివాళ్లు అవడంవల్ల, ఖైదీలు ఆహారంగురించి వారుచెప్పినదే ఆధారంగా తీసుకో కుండా ఖైదీలు మానవులుగా జీవించేందుకు తగిన ఏర్పాట్లు చేస్తుందా?

The Hon. Sri T. VISWANATHAM:— జైళ్ళ సంగతి తెలిసినవాళ్ళు అందులోనూ వున్నారు. జైళ్ళలోనికి వెడితే ఇక్కడవున్న 140 మంది weight పెరిగారు. అయితే రుచికరంగా చేయడంలో విధా యాకం కొంతఅవసరం వున్నది. దానికి తగిన ఏర్పాట్లు చేస్తున్నాము.

Sri L. LAKSHMANA DAS:—అధ్యక్షా! ఇన్ని సదుపాయ ములు ఉంటే ప్రతివారు జైలుకు వెళ్ళడానికి ప్రయత్నం చేస్తారు. జైలుకు వెళ్ళితే కష్టాలు వుండవు అని తెలియచెయ్యడానికి, సరైన ఆహారం ఇవ్వడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా

No answer.

*Complaints under the Factories Act 1949.*

* 295 Q.—Sri G. YALLAMANDA REDDI :— Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state :

(*a*) the number of complaints chiefly in respect of non-payment of wages, dismissals, suspension and non-grant of leave with wages, recieved by the Labour Department under "The Factories Act 1949" in years 1951 and 1952 ; and

(*b*) the number of cases disposed of in favour of the workers in each year ?

The Hon. Sri D. SANJIVAYYA :—

Clause (*a*) :— The number of complaints received during 1951 and 1952 under each category under the Factories Act 1948 is as follows:

| | | | | |
|---|---|---|---|---|
| Non-payment of wages. | 308 in 1951 | & | 305 in 1952 | |
| Dismissals. | 289 | ,, | & 255 | ,, |
| Suspensions. | 13 | ,, | & 28 | ,, |
| Non-grant of leave with wages. | 57 | ,, | & 45 | ,, |
| Miscelleneous. | 200 | ,, | & 328 | ,, |

Clause (*b*):— 428 complaints in 1951 and 589 in 1952 were disposed of in favour of the workers.

Sri K. KRISHNA RAO:-గవర్నమెంటుకు factoris, work shops మొదలగు వాటివిషయములో యీ కేసులు ఎన్ని వచ్చినాయో వాటిపై ఎట్టి చర్య తీసుకున్నది figures యిస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA :- I do not have the details of figures. If the hon. Member puts a separate question I shall answer it.

Sri M. VEERABHADRAM:—డిస్మిస్సు చేసిన వర్కర్ల విషయంలో పోలీసువారి కంప్లయింట్లమీాద ఎంతమందిని డిస్మిసు చేశారో చెబుతారా?

The Hon. Sri D. SANJIVAYYA:-I have no idea, Sir.

Sri T. NAGI REDDI:— ట్రిబ్యునల్సు వర్కర్లకు అనుకూలంగా ఇచ్చిన తీర్పులను ఆచరణలో పెట్టేటట్లు ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నదా?

The Hon. Sri D. SANJIVAYYA :— ఎప్పుడైతే తీర్పులు వస్తవో వాటిని అమలుపెట్టడానికి ప్రభుత్వం శ్రద్ధ తీసుకుంటుంది. కాని ఎంప్లాయర్సు ఇంకా కొన్ని ట్రబుల్సు ఇస్తున్నారు. ప్రభుత్వం మాత్రం వాటిపరిష్కారానికి కృషిచేస్తున్నదని చెబుతున్నాను.

*Post Graduate Courses in Government College, Anantapur.*

* 296 Q.—Sri T. NAGI REDDI:-Will the Hon. the Minister for Education and Industries be pleased to state:

15th March 1954 ]

(*a*) Whether there is any proposal to start Post Graduate Courses in Government College, Anantapur and,

(*b*) if so, when?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:—

(*a*) and (*b*)—The matter is under examination.

Sri T. NAGI REDDI:—పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులను డెవలపు చెయ్యాలని ప్రభుత్వ దృష్టిలో ఎన్ని సంవత్సరాలుగా ఉన్నది. ఇంకా ఎన్ని సంవత్సరాలు ఆలోచిస్తూ ఉంటుందో తెలియచేస్తారా.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:—సరిగ్గా సంవత్సరాలు, నెలలు చెప్పలేను. కొన్ని సంవత్సరాలుగా ఆలోచిస్తున్నది. అనంతపురంకాలేజి మద్రాసు విశ్వవిద్యాలయంలో ఎఫీలియేటు అయిఉన్నది. ఇప్పుడు దానిని ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఎఫిలియేటు చెయ్యవలసి ఉంది. కొద్దిరోజులలో తిరుపతి విశ్వవిద్యాలయం రాబోతున్నదన్న విషయం గౌరవనీయులైన ప్రతిపక్ష నాయకులకు తెలుసును. బిల్లు తయారు అయ్యేవరకు నేను ఏమీ చెప్పలేను.

Sri T. NAGI REDDI:—రాయలసీమకు ఉండే కాలేజీలలో ఒక్క అనంతపురంలోనే సైన్సుకోర్సులు ఉన్నవి. కాబట్టి అక్కడ సైన్సులో పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులను ఇమిడియేటుగా ప్రవేశపెట్టడానికి వీలుఉన్నది. వచ్చే జులై నెలలోనే ఈ కోర్సులను ప్రారంభించడానికి ప్రభుత్వం ఏమైనా కృషిచేస్తుందా? వీలుఉందని అక్కడి ప్రొఫెసర్లు చెబుతున్నారు.

The Hon. Sri S. B. P. PATTABHI RAMA RAO:—నాగిరెడ్డిగారు ప్రొఫెసర్లు చెబుతున్నారన్నారు. సంతోషమే; కాని ఆటానమీఉన్న విశ్వవిద్యాలయమువారుకూడా పెర్మిటు చేయవలయును. ఇది అంత సులువు అయినదికాదు. విశ్వ విద్యాలయం ఏర్పడి ఆ విశ్వవిద్యాలయానికి ఈ కళాశాల కలసినప్పుడు ఆ విశ్వవిధ్యాలయము వారు ఒప్పుకున్నప్పుడు గాని మనము ఏమీ చెప్పలేము. కాబట్టి ఇప్పుడే ఇదమిద్ధమని ఏమీ చెప్పడానికి అవకాశం లేదు.

Sri T. N. VENKATASUBBA REDDI:— తిరుపతి విశ్వవిద్యాలయము వచ్చేలోపుగానే రాయలసీమ విద్యార్థుల విషయమై సైన్సు కోర్సులతో ఆనర్సు తరగతులను జూలై నెలలో స్థాపించడానికి ప్రభుత్వం కృషిచెయ్యాలని కోరుచున్నాను.

The Hon. Sri S. B. P. PATTABHI RAMA RAO:— విద్యార్థులకు ఇబ్బందిలేదు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలోకూడా చేర్చుకుంటారు. తిరుపతి విశ్వవిద్యాలయంలో సైన్సుకోర్సులను ప్రవేశపెట్టాలని ప్రభుత్వానికి అభిప్రాయం యుంటుంది. రాయలసీమ విశ్వవిద్యాలయం, దానిపేరు తిరుపతి వెంకటేశ్వర విశ్వవిద్యాలయం లెండి, తిరుపతిలోనే సైన్సు కోర్సులను స్టార్టు చేసున్నాము. రాయలసీమ విద్యార్థులకు ఎప్పుడుకూడా ఇబ్బందిలేదు. మద్రాసు విశ్వవిద్యాలయం ఆంధ్ర విశ్వవిద్యాలయం రెండుకూడా విద్యార్థులను చేర్చుకుంటున్నారు.

Sri T. N. VENKATASUBBA REDDI :— Sir, the Hon. Minister seems to have misunderstood me, that the Rayalaseema students will not be admitted in the Andhra University. That is not what I stated. There is a shortage of accommodation for students in the Honours Courses in the Madras University and the Andhra University, as only a very small number of seats is available to those who want to take Science Honours courses. Now, after the formation of the State, the Madras University will give preference only to Madras University students. So, I want the Hon. Minister to make efforts to start Honours Courses in our State, so that our students will have facility for taking Honours courses from this year.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :— I have just said the same thing. I am sorry the hon. Member did not understand me properly. For the starting of Honours Courses it is not Government alone that is responsible. The affiliating University also should be consulted. The present position regarding Honours Courses is quite unfortunate ; I admit that is

why the Venkateswara University is being started. Colleges will have to be affiliated to that University, and the University has to decide whether these colleges can start Honours courses. All the same, we are starting Honours courses in Anantapur College. Therefore, there will not be difficulty for students, even admitting for the sake of argument the difficulty as envisaged by Sri Venkatasubba Reddi. So, from what I have said, not only Rayalaseema boys, but all boys will have facility to take up Honours Courses.

Sri T. NAGI REDDI:— అధ్యక్షా, ఆనర్సు కోర్సులను స్టార్టు చెయ్యడానికి ఒక ప్రభుత్వానిదే బాధ్యతగాదని యూనివర్సిటీ కూడా అంగీకరించవలెనని చెప్పేరు. మద్రాసు విశ్వవిద్యాలయంలో ఉండగా ఏమి ప్రయత్నాలు చేశారో తెలియదు. పోతే ఇక ఆంధ్ర రాష్ట్రం వచ్చిన తరువాత తిరుపతి విశ్వవిద్యాలయం ఏర్పడి ఆ ఆటానమస్ బాడీ దాని విధానము తెలియచేస్తుందని చెబుతున్నారు. రామలింగారెడ్డి కమిటీ రిపోర్టు తరువాత తీసుకున్న చర్యలు ఏమిటో తెలియదు. ఇప్పటివరకు అనంతపురం కాలేజీలో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సుల స్థాపన అంటూ జరగలేదు. ఇక ముందు ఏమి చేస్తారో తెలియదు. వచ్చే జూలై నాటికైనా సరియైన నిర్ణయం తీసుకోవాలని మనవి చేస్తున్నాను.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— ఇంతవరకు ఎట్టి నిర్ణయం జరగలేదు. వచ్చే జూలైనాటికి సైన్సుకోర్సులను స్టార్టుచెయ్యడం సాధ్యంకాదని మనవి చేస్తున్నాను. విద్యార్థులకు ఇబ్బంది లేకుండా ఈ ప్రభుత్వం ప్రయత్నం చేస్తుంది. ఆనర్సు కోర్సులను తిరుపతిలో ప్రారంభించడానికి ప్రభుత్వం తప్పక ప్రయత్నం చేస్తుందని చెప్పగలను. ఇకపోతే పూర్వప్రభుత్వం ప్రయత్నించిందా అంటే ప్రయత్నం చేసే ఉంటుందని నాకు తెలిసినంతవరకు చెప్పగలను. మన డైరక్టరు గారు మద్రాసు విశ్వవిద్యాలయంతో సంబంధం ఉన్నవారు. ఆయన చెప్పినదేమిటంటే కొన్ని చిక్కులవల్ల అనంతపురంలో సైన్సుకోర్సులను పెట్టడానికి వీలులేదన్నారు. మద్రాసు పట్టణంలోవున్న కాలేజీలకు తప్ప తక్కిన వాటికి ఆనర్సు కోర్సులను పెట్టడానికి పెర్మిషను ఇవ్వలేదు. అంతేగాని ప్రభుత్వానికి ఉద్దేశం ఉందనిమాత్రం చెబుతాను.

[15th March 1954

Sri K. VARADACHARI:—May I know whether the decision to start post-graduate Courses in science in the proposed Venkateswara Univesity means that you are going to give up the Courses in the humanities which are existing there?

The Hon. Sri S. B. P. PATTABHIRAMARAO:— Most certainly not. The point is, there is not much accommodation for running all classes. We want class rooms, we want equipment and so on. We have not equipment and accommodation for science classes to start with and therefore we are starting them. If it is possible to start humanities classes also, it is our anxiety to start them also. It all depends upon so many circumstances, the accommodation available, the staff, the equipment etc.

Sri M. HANUMANTHA RAO:—అధ్యక్షా, మంత్రిగారు యే University తో నైతే Colleges affiliate ఐతే ఆ University authorities approval కావాలన్నారు. మద్రాసునుంచి చీలిపోయిన తర్వాత మద్రాసు విశ్వవిద్యాలయానికి affiliate ఐన Colleges కు యిబ్బందులు ఏర్పడుతాయని ప్రభుత్వానికి తెలియదా? C. R. Reddy Committee recommendation ప్రకారం వెంటనే Rayalaseema Colleges ను Andhra Uuiversity కి January లోనే affiliate చేయడానికి ఎందుకు నిర్ణయము తీసుకోలేదు. తీసికొనివుంటే యీరోజున యింత అవస్థ వుండేదికాదుగదా? ఇందుకు బాధ్యత ప్రభుత్వానిదిగదా?

The Hon. Sri S. B. P. PATTABIRAMA RAO:— January లో వేరే విశ్వవిద్యాలయము స్థాపించలేదు. ప్రత్యేక విశ్వవిద్యాలయము ఏర్పాటు చేస్తున్నప్పుడు రాయలసీమ కళాశాలలను ఆంధ్ర University కి affiliate చేయడము అక్కరలేదు.

Sri M. HANUMANTHA RAO:— అదికాదండి నేనడిగిన ప్రశ్న. ముఖ్యంగా ప్రభుత్వం యీ విషయములో committee వేయడమువల్ల చాలకాలము వృధా అయింది. ఇంతలో విద్యార్థులు చాల అవస్థ పడవలసి వుంటుంది. మద్రాసునుండి విడిపోయిన వెంటనే మద్రా

కుకు affiliate ఐవున్న కళాశాలలను ఆంధ్ర విశ్వవిద్యాలయములో చేర్చవలసి యున్నది. ఆవిధంగా చేసివుంటే నష్టమేమి వుండేదికాదు. ఇలా చేయక ఎందుకు నష్టం కలిగించారనేదే ప్రశ్న—

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:—ఇప్పుడేమి నష్టము కాలేదు, జాగుకాలేదు. మనదేశములో మొత్తము అనేక ప్రదేశాలలో రాష్ట్రాలు విడిపోయినప్పటికికూడ ఆ కళాశాలలు వేరే రాష్ట్రములోని University కి affiliate కాకుండనే వున్నవి. యిబ్బందులు లేకుండ ప్రత్యేక సౌకర్యములు ఏర్పాటుచేస్తాము.

Sri VAVILALA GOPALAKRISHNAIAH:—అధ్యక్షా, నన్ను పిలిచారండి.

Mr. SPEAKER:—సరే కానివ్వండి.

Sri VAVILALA GOPALAKRIHSNAIAH :—అధ్యక్షా, మద్రాసు రాష్ట్రములో వున్నపుడే ఈ విషయం మేము ఆలోచించాము అన్నారు Composite state లోనే, ఆంధ్ర విశ్వవిద్యాలయములో రాయలసీమ కళాశాలను చేర్చుటకు ప్రతిపాదన జరిగిందన్నారు. తిరిగి యిపుడు తిరుపతి విశ్వవిద్యాలయము బిల్లు తీసుకొని రాబోతున్నానుని, యీలోపున అనంతపురంలో post-graduate courses పెట్టుతాము అని బడ్జెటు వుపన్యాసములో శ్రీ విశ్వనాథంగారు అన్నారు. యీ మొత్తముచూస్తే ఒకదానికి ఒకటి సంబంధములేని పరిస్థితిలో వుంది. C. R. Reddy Committee సిఫార్సుల ప్రకారంఅయినా, లేక తిరుపతికి విశ్వవిద్యాలయమువస్తే అనంతపురంలో post graduate coursesపెట్టుతారా ? ఆ విషయము తెలుపగోతుతున్నాను?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:—శ్రీ గోపాలక్రిష్ణయ్యగారు చెప్పిందంత అతుకులబొంతగా వుంది. అక్కడక్కడ ఏదో కొంత తీసి అతకడములో అర్థములేదు. అతుకులబొంతకు జవాబు అతుకుల బొంతగానే చెప్పవలసి వస్తుంది. C. R. Reddy Committee report ఎప్పుడు వచ్చింది. ఎంతకాలమైంది. రాయలసీమను AndhraUniversity లో కల్పడానికి అంగీకరించారు. కాని కొన్ని కార

గాలవల్ల అది జరగలేదు. C. R. Reddy Committee , రెడ్డిగారు పోయి చాలకాలమైంది. report వచ్చి యెంతో కాలమైంది. ఇంత కాలముక్రింద జరిగిన విషయము నన్నడిగితే నేనేమి చెప్పేది. రెండవ విషయము. అప్పుడు మద్రాసు ప్రభుత్వమేమి చేసిందో తెలియదు. రాయలసీమ విద్యార్థుల సౌకర్యానికి ఒక బిల్లు తయారుచేయబడింది. అది తిరుపతి విశ్వవిద్యాలయ బిల్లు. ఇప్పుడు మద్రాసు విశ్వవిద్యాలయములో అనంతపురం వున్నది కాబట్టి వాండ్లు ఏమి నిర్ణయము తీసికుంటారో ప్రత్యేక ప్రశ్న వేస్తే చెప్పగలను. అనంతపురం కళాశాలలో Honours Courses1954 లో పెట్టడానికివీలులేదు. Science Courses తిరుపతిలో పెట్టబోతున్నారు. ఏది పెట్టినప్పటికికూడ All India లో వున్న Degrees తో బాటు recognize కావడానికి యీ విశ్వవిద్యాలయానికి కొంచెము హెచ్చుస్థానము యివ్వవలసి యున్నది. విశ్వవిద్యాలయము యీ courses అనంతపురంలో పెట్టమంటె తప్పకుండ అక్కడ పెట్టుతాము. ప్రస్తుతము తిరుపతి కేంద్రములోనే Honours courses నడుస్తవని నేను మనవి చేస్తున్నాను.

*Reservation of Forests in Zamindari Areas.*

*297 Q.—Sri G. YALLAMANDA REDDI:-Will the Hon.the Minister for Local Administration and Agriculture be pleased to state whether the Government propose to frame any rules to safeguard the intersts of Zamindari ryots while finalising the reservation of forests in Zamindari areas?

The Hon. Sri P. THIMMA REDDI :—

No, Sir. Provision already exists under the Madras Forest Act 1882 itself for enquiry into the existing rights in Zamindari forests and their settlement before the areas are constituted into reserved forests under the Act. No special procedure need therefore be promulgated for this purpose.

జమీందారీలనుండి సక్రమించినటువంటి రిజర్వు అడవులలో జమీందారీ రైతులహక్కులను కాపాడటానికి 1882 Madras Forest Act లో రక్షణ అవకాశాలు కల్పించబడినవి. అందువల్ల ప్రత్యేకంగా

జమీందారీ రైతుల హక్కులను కాపాడటానికి ప్రత్యేకమైన రక్షణ చట్టమును చేయవలసిన అగత్యం లేదు.

Sri G. YELLAMANDA REDDI:— సమిష్టి రాష్ట్రములో మంత్రిగారున్న గౌడుగారు ఎస్టేటు రైతుల ప్రత్యేక హక్కులు రక్షించబడుతాయని చెప్పారు. కాని యిచ్చట మంత్రిగారు ప్రత్యేక రక్షణ అవసరంలేదని చెప్తున్నారు, అనాదినుంచి వస్తున్న యీ రైతాంగ హక్కులను రక్షించుటకు ప్రభుత్వము ఆలోచిస్తుందా?

The Hon. Sri P. THIMA REDDI: ప్రశ్నకు జవాబుచెప్పు చున్నప్పుడు గౌరవసభ్యులు వేరొక ప్రశ్నకు సిద్ధముగా వుంటారు గనుక, జవాబు పూర్తిగా విని, మరొక ప్రశ్న వేయటం మంచిది.

Sri B. KRISHNAMURTHI RAO:-జమీందారీ విధానము రద్దయినటువంటి ప్రదేశములలో ప్రభుత్వమునకు సంక్రమించినటువంటి అడవులకు రక్షణకు తగిన చర్యలు తీసుకున్నామని చెప్పారు. ఇటీవల పుంగనూరు ప్రాంతములలో మంత్రిగారు పర్యటన చేసిన సందర్భములో, అచ్చటి అడవుల విషయములో తగిన రక్షణ లేదని చెప్పియున్నాము. అట్టివాటి విషయములో రక్షించుటకు, ప్రభుత్వం పూనుకున్నదా?

The Hon. Sri P. THIMMA REDDI:— గౌరవసభ్యుడు చెప్పిన ప్రకారం, జమీందారులనుండి ప్రభుత్వమునకు సంక్రమించిన రిజర్వ్ అడవులను సంపూర్ణముగా కాపాడడానికి పూర్తిచర్యలు తీసుకొనబడినవి. చిత్తూరుజిల్లాలోని పుంగనూరు రిజర్వ్ forest విషయము కోర్టులో వ్యవహారములు జరుగుచున్నవి. ఇంకా ఆ court లో finalగా settle కాలేదు. అక్కడివాటికి కొంత అన్యాయం జరిగింది రెండుమూడు రోజులలో ఒక ఉత్తర్వు చేస్తున్నాము.

Sri D. RAMABRAHMMAM:— చిత్తూరు జిల్లాలోని రిజర్వ్, అన్-రిజర్వ్డుఅడవులనుగూడా, అరవ ప్రాంతాల భూస్వాములు ఆక్రమించుకొని రిజర్వ్‌లను నాశనము చెస్తున్నారు. కాబట్టి అట్టివారిని రాకుండా అరికట్టి, ఆ forests ను కాపాడడానికి దిట్టమైన చర్యలు ప్రభుత్వం తీసుకుంటున్నదా?

The Hon. P. THIMMA REDDI:- Reserved, unreserved అన్నింటిని కాపాడుటకు, తగిన చర్యలు తీసుకొనడానికి అక్కడ వుద్యోగస్తులు వున్నారు. రిజర్వు forest ను కాపాడానికి forest డిపార్టుమెంటు వారున్ను, un-reserved forest లను కాపాడడానికి రెవెన్యూ డిపార్టుమెంట్ ఉద్యోగస్తులున్నూ వున్నారు. ఆ వుద్యోగస్తులే, తగినచర్య తీసుకుంటారు. అలాంటివి ఏమైనా జరిగితే, ప్రభుత్వదృష్టికి తెచ్చేముందర అచ్చట స్థానిక అధికారులకు రిపోర్టుచేస్తే, వారే తగినచర్యలు తీసుకుంటారు. ఆ తరువాత, ప్రభుత్వంగూడా తగిన చర్యలు తీసుకుంటుంది.

Sri P. GUNNAYYA:— పార్వతీపురం బొబ్బిలి తాలూకాల లోని, రిజర్వుడు forests లో కొన్ని గ్రామాలు కాలిపోయినవి. వారు, యిండ్లు కట్టుకొనుటకు, unreserved forest లోనుంచి, కలప, వెదుళ్ళు, వగయిరా పరికరములను తెచ్చుకొనుటకు ఆ ప్రాంత అధికారులు అనుమతి యివ్వలేదు. అక్కడివారికి ఇండ్లు కట్టుకొనుటకు కావలసిన కలపను ఆ forest లోనుంచి supply చేయుటానికి, ప్రభుత్వం తగినచర్యలు తీసుకున్నదా? మేకల మేపుకొనుటకు ఆర్డరు యిప్పించవలెను.

The Hon. Sri P. THIMMA REDDI:— ఇండ్లు కట్టుకోడానికి, కలప కావలసివస్తే అడుగవలసినది ఆ ప్రాంత కలెక్టరుగారినే. అంతేగాని, అచ్చటి స్థానిక ఉద్యోగులను అడిగితే వారు, అనుమతి యిచ్చేందుకు వీలులేదు. వారు, కలెక్టరుగారికి తెలియచేసుకుంటే, అందుకు తగిన ఏర్పాట్లు చేస్తారు.

Sri K. RAMAIAH CHOUDARY:—జమీందారీ గ్రామాలలో ప్రభుత్వం స్వాధీనము చేసుకున్న సర్వే జరుగని అడవులు చాలా వున్నవి. ఆ గ్రామాలలోని రైతులు, పొయ్యిలోకి కంప వగయిరాలు దొరకక చాలా అవస్థలు పడుచున్నారు. ప్రభుత్వం సర్వే జరుగనటువంటి, యీ అడవులను అచ్చట రైతుల వుపయోగము నిమిత్తం, ఆ గ్రామ పంచాయితీలకు వదలిపెట్టి, వారి కష్టసుఖాలను చూడటానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా?

15th March 1954 ]

The Hon. Sri P. THIMMA REDDI:—Forests ను, పంచాయితీలకు ఒప్పగించటము వల్ల, reserved forests ల అగత్యము లేకుండానే పోతుంది. అచ్చటి స్థానికి రైతుల అవసరాలు కాపాడడానికి ప్రభుత్వం తగినచర్య తీసుకుంటుంది.

Sri K. VARADACHARI:— May I know whether there is a complaint that the timber traffic rules are not giving any scope for the Forest Officers to take action against people who violate the rules in other ways?

The Hon. Sri P. THIMMA REDDI:-వారువేసిన ప్రశ్న నాకు తెలిసినది. Timber transit rules బాగుకుగూడా వర్తిస్తుందాఅనిఅడిగారు? బాగుకుగూడా ఆ rule apply చేయటానికి ప్రభుత్వం ఆర్డరు జారీ చేస్తుంది.

Sri K. KRISHNAM RAJA BAHADUR:— జమీందారీలకు స్వాధీనము చేసుకున్నప్పుడు, అచ్చటి రైతులకు కలప, కంప, వగయిరాలు తెచ్చుకునే విషయములో హామీలు యిచ్చారు. దానిని గురించి 11-జూలై 52 న ఒక Press note కూడా issue చేశారు. ఆ ప్రకారం, ఆ ప్రాంతాల రైతులకు కలప యిస్తామని చెప్పారు. ఈ విషయంలో ప్రభుత్వం ఏమైనా గుర్తించిందా? ఇందును గురించి గవర్నమెంటు ఏమి చేసినది?

The Hon. Sri P. THIMMA REDDI:- జమీందారుల నుండి యీ అడవులు ప్రభుత్వ స్వాధీనమునకు వచ్చిన తరువాత, వీటిని కాపాడటము, అభివృద్ధి చేయటముగూడ ప్రధానమైన విషయము. రైతులకు సంబంధించిన కొన్ని కష్టాలను చెప్పారు. ప్రభుత్వ వుద్దేశ్యములో యీ అడవులలోని dead fuel ను తెచ్చుకుంటే అభ్యంతరము లేదు. కాని అట్లాకాకుండా కొంతమంది, అక్కడి పచ్చికలపను నరికి, ఎండబెట్టి 10 రోజుల తరువాత తెచ్చుకోవటం చేస్తున్నారు.

Sri P. VENKATA SUBBAYYA:— శ్రోత్రియందార్ల స్వాధీనములోనున్న రిజర్వు forest లు చాలా నాసనమైపోతున్నవి.

ఇవి వారివద్దనుండి స్వాధీనము చేసుకొని, వారికి compensation యిస్తారా?

The Hon. Sri P. THIMMA REDDI:- ఇది ప్రత్యేకంగా, ఆలోచిస్తాం.

*Provision of House Sites to Harijans in Nellore District.*

* 298 Q.—Sri K. KRISHNA RAO :—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state :

(*a*) with reference to the programme for 1950-51, for Nellore District in the matter of providing house sites to Harijans why only 2 cases involving an expenditure to the Government of Rs. 1,412-7-1 were taken up while 40 cases involving an expenditure of Rs. 68,689-8-0 was programmed for;

(*b*) with reference to the programme for 1951-52, in Nellore district, in the matter of providing house sites for harijans. why only 11 cases involving an expenditure of Rs. 16,153-15-6 were taken up while 30 cases involving an expenditure of Rs. 50,534-0-0 were programmed for ?

The Hon. Sri D. SANJIVAYYA :—

(a) All the 40 cases selected in 1950-51 have been investigated. In the two cases of Velagalavagu and Vemaguntapalem taken up, lands were acquired for providing house sites and an expenditure of Rs. 1796-7-1 was incurred. In 14 cases the proposals to acquire land were dropped. As the connected disposals have been destroyed due to efflux of time the reasons for dropping the proposals are not available. In the remaining 24 cases, the enquiries were pushed through in 1951-52 to complete them. The delay in disposing of all the remaining cases in 1950-51 is due to elaborate procedure to be observed in acquisition proceedings under the Land Acquisition Act and the unwillingness of the Harijans in some cases to take up the sites selected by the Government.

15th March 1954 ]

(b) Out of the 30 cases selected for 1951-52 awards have been passed for 11 cases and lands taken possession of. Out of the remaining 19 cases awards were passed in 3 cases in 1952-53 and in one case in 1953-54. Draft notification and Draft Declaration have been approved in 3 other cases and the notifications are under preparation in 4 cases. Proposals were dropped in respect of the four cases as house sites required for the Harijans were provided otherwise without resorting to acquisition. The reasons in respect of the four other cases are not available as the connected records have been destroyed by efflux of time. The reasons for not disposing of all the 30 cases in 1951-52 are the same as those furnished in answer to (a) above.

Sri T. NAGI REDDI:— ఇంత పెద్దప్రశ్నకు, యిన్ని అంశములతో. అంకెలతో గూడిన సమాధానమును అచ్చువేసి table మీద పెట్టితే దీనిమీద ఉపప్రశ్నలు వేయుటానికి [illegible] వుండేది. దాదాపు 5 నిముషములు, నాకు చదవటానికే పట్టింది. ఇకను ఆ మంత్రిగారు యీ పద్ధతి అవలంభించితే వుపయోగములేదు ఏదైనా వారు చెప్పే విషయాలన్నింటిని, అచ్చువేయించి table మీద పెట్టించగలరని ఆశిస్తున్నాను. ఇది చాలా ముఖ్యమైన ప్రశ్నగనుక, table మీద రేపే పెట్టించవలసినదిగా విజ్ఞప్తిచేస్తున్నాను. లేకపోతే, ఉపప్రశ్నలు వేయటానికి, చాలా కష్టముగా వుంటుంది.

The Hon. Sri D. SANJIVAYYA:— I have absolutely no objection.

Sri T. NAGI REDDI:— మంత్రిగారు, రేపటిరోజునే పెట్టడానికి యిష్టపడుతున్నారు. ఈ ప్రశ్న రేపే తీసుకునేటట్లయితే, చాలా ఉపయోగంగా వుంటుంది. ఆ ప్రశ్నకు సమాధానం రేపు table మీద మాకు వుంటుందిగాబట్టి, ఉపప్రశ్నను వేయటానికి వీలుగా వుంటుందని విజ్ఞప్తిచేస్తున్నాను.

The Hon. Sri D. SANJIVAYYA:— I have absolutely no objection, subject to your orders.

Mr. SPEAKER :— I will consider it.

Sri K. KRISHNA RAO.— రేపటి దినము దీని మీద supplementary questions వేయవచ్చునంటు, రేపే ఆ వివరము లన్ని table మీద పెట్టితే, ప్రశ్నలు అడుగుటకు అనుకూలంగా యుంటుంది.

Mr. SPEAKER :— The Chair has not yet come to any conclusion on that point. The hon. Member may put one or two supplementary questions now.

Sri PILLALAMARRI VENKATESWARLU :— దీన్ని postpone చేయకపోతే, మళ్ళీ అవకాశంవుండదు కాబట్టి, ఈ విషయంలో మీరు conclusion కు వచ్చినతరువాత, దీనిని తీసుకో వచ్చునని మనవిచేస్తున్నాను.

Mr. SPEAKER :— It won't come up tomorrow, as it takes some time for printing etc., Therefore the hon. Members may put 2 or 3 supplementary questions now itself.

Sri T. NAGI REDDI :— ప్రింటింగు చేయుటకు కష్టము. టైము కావలసియుంటుందన్నారు. అయితే cyclostyle సులభముగా చేయవచ్చును. రేపు 16 వ తేదీ సెలవు అనికూడా తెలియజేశారు. కనుక 17 వ తేదిలోపల దీనిని తయారుచేయుటకు సాధ్యమవుతుందని ఆశిస్తున్నాను. కనుక దీనిని consider చేయాలని మనవిచేస్తున్నాను.

*Development of Minor Sea Ports in Andhra.*

* 299 Q.—Sri T. LAKSHMINARAYANA REDDI :- Will the Hon. the Deputy Chief Minister be pleased to State the amount given by the Central Government to develop minor sea ports in Andhra ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— The Government of India have agreed to grant a loan of Rs. 10.39 lakhs for the development of minor ports in the Composite State of Madras. The apportionment of

this amount between the Residuary Madras State and the Andhra State and the terms and conditions of the loan are under consideration.

The amount of loan that may be obtained from the Government of India, each year will depend on the actual expenditure incurred on approved schemes by the State Government.

Sri T. LAKSHMINARAYANA REDDI:— ఈ డబ్బు ఆంధ్రరాష్ట్రములో ఏయే ports యొక్క అభివృద్ధికి ఖర్చుపెట్టాలని ప్రభుత్వం తలపెట్టింది. ఆ అభివృద్ధి ఏవిధముగా ఉంటుందో మంత్రిగారు తెలియజేస్తారా?

The Hon. Sri N. SANJIVA REDDI:— ఇదివరకే, దీనికి నేను జవాబు చెప్పాను. మచిలీపట్నము, కాకినాడ, ఈ రెండు ports కే ఈ డబ్బు ఖర్చు పెట్టుటకు నిశ్చయించుకున్నామని. అసలు ఈ రెండింటి అభివృద్ధికి, ఈ డబ్బు చాలదు, ఇంకా ఎక్కువడబ్బు ఇవ్వమని కేంద్ర ప్రభుత్వాన్ని కోరడానికికూడా నిశ్చయించుకొన్నాము.

*House Sites for Harijans in Regulapad Village in Anantapur District.*

* 300 Q.—Sri S. NARAYANAPPA:— Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state:

(*a*) the area of land acquired for Harijan house sites in Regulapad village, Uravakonda Sub-taluk, Anantapur district and when;

(*b*) the amount paid to the landowner towards the compensation of the land from this Department;

(*c*) the amount that the Harijans of the said village deposited with the Government for the purpose of acquiring house sites;

(*d*) whether the said land has been handed over to the Harijans and if not why; and

(*e*) in view of the terrible scarcity of housing accommodation of the Harijans, whether the Government will take immediate steps to hand over the land to the Harijans ?

The Hon. Sri D. SANJIVAYYA :—

(*a*) An extent of Ac. 3-06 cents was acquired on 27-6-53.

(*b*) The landowner refused to receive the compensation.

(*c*) Rs. 500/- by Harijans.

Rs. 440/- by Boyas and Erukulas.

(*d*) and (*e*): The landowners have raised some objections to the acquisition and suggested some alternate site.

The Director of Harijan Welfare has been asked to report on the suitability of the alternate site and on reciept of his report action will be taken to acquire the land.

(*a*) 3 ఎకరాలు, 6 సెంట్లు, 27–6–53 తేదీన acquire చేసుకొన్నాము.

(*b*) ఈ భూమి owner, compensation తీసుకోడానికి నిరాకరించాడు.

(*c*) 500 రూపాయలు హరిజనులు యిచ్చారు.

440 రూపాయలు బోయవారు, ఎరుకలు యిచ్చారు.

(*d*) & (*e*) ఈ భూఖామందులు దీనికి కొన్ని objections పెట్టి, దీనికంటె మంచిస్థళం యింకొకటి వున్నదని, దాన్నితీసుకుంటే బాగుంటుందని చెప్పారు ఈ విషయంలో Harijan Welfare Director యొక్క report అడిగినాము. ఆ రిపోర్టురాగానే ఈ విషయము పరిష్కరింపబడుతుంది.

Sri B. KRISHNAMURTHI RAO :— అధ్యక్షా, 3 ఎకరాలు, 6 సెంట్లు విస్తీర్ణంగల ఒక భూమిని 27-6-53 తేదీన ప్రభుత్వము యివ్వడానికి నిశ్చయించుకొని, భూకామందులు దానికి నష్టపరిహారము పుచ్చుకోని కారణంచేత నిలచిపోయిందని చెప్పారు. దీనికగాను, హరిజనులు మొదలుగువారు వెయ్యిరూపాయలవరకుగూడ deposit చేశారు. ఇప్పటికే యిది ఆలస్యం అయిపోయింది. కనుక యీ సమస్యను ప్రభుత్వమే నేరుగా వ్యవహరించి, వారికి తొందరగా భూమియివ్వడానికి ప్రభుత్వము పూనుకొంటుందా ?

The Hon. Sri D. SANJIVAYYA :— భూకామందులు ఇష్టపరిహారాన్ని నిరాకరించినంతమాత్రాన, యిది ఆపుదలకాలేదు. నంములో కొన్ని valid objections ఉన్నట్లు కన్పిస్తున్నది. ఈ భూమి suitable గా ఆరోగ్యకరంగా లేదని, ఇంకొకటి ప్రభుత్వానికి చెందినది మంచిస్థలం వున్నదని చెప్తున్నారు. ఇది కొంత valid objection గాను, Prima facie గాను కన్పిస్తున్నది. కనుక దీనిని Harijan Welfare Director కు refer చేసి ఆరిపోర్టు అడిగాము. ఇది valid objection కాకపోయినట్లయితే, ఈ భూమే యివ్వబడుతుంది.

*Salary to Graduate Teachers*

* 301 Q.—Sri K. KRISHNA RAO :—Will the Hon. the Minister for Education and Industries be pleased to state ;

(*a*) whether it is a fact that a graduate teacher in Government Service is paid a minimum salary of Rs. 100/-;

(*b*) if so, whether there is a similar rule made applicable in the case of graduate teachers in educational institutions under Local Boards, Municipalities, and

(*c*) if not, why not ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :—

(a) Yes. Government sanctioned the drawal of minimum pay of Rs. 100/- per mensem to all the

[ 15th March1954

school assistants and Deputy Inspectors of Schools in Grade II in the scale of Rs. 85-5-125-10-175, who possess the B. T. or B. E. D, or L. T. Degree.

(b) No.

(c) This Government is continuing the policy [of the composite State] That existed all these years in this regard. The question asked by the hon. Member will be examined in detail, if and when, any representation is received, considering the financial position of these local boards.

(Some hon. Members requested the Hon. Minister to translate his answer in Telugu.)

Mr. SPEAKER :—Hon. Members must make some attempt to understand the discussions given in English. If every answer is to be translated like this, there will be much waste of time.

Sri T. NAGI REDDI:—నా సలహా ఏమిటంటే మంత్రులు answersచదివేటప్పుడు, తెలుగులోనే చెప్పితే సరిపోతుందని తెలుగులో చెప్పడం చాలా అవసరం. ఎందుకంటే, ఇక్కడ నూటికి 40 మంది ఇంగ్లీషురానివా రున్నారు.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— కొన్ని technical words ఉంటాయి. కాబట్టి వాటిని తెలుగులో మార్చడానికి కొంత time పడుతుంది. అంతేగాని మరేమిలేదు. అయినా తెలుగులో చెప్పుతాను.

(a)అవును. ప్రభుత్వమువారు ఇదివరకు ఇస్తున్నట్లుగానే స్కూళ్లలో ఉండే, B. Ed; L. T; B. T; అంటే training qualifications ఉన్నటువంటి Graduates కు, Deputy Inspectors of Schools, Second Grade, వారికిని, నెలకు 100 రూపాయలు. 85-5-125-10-175 స్కేలులో ఇస్తున్నారు.

(b) లేదు.

(c) ఇదివరకు, ఇన్ని సంవత్సరాలుగా, ఉన్నటువంటు policy నే ప్రస్తుతము ప్రభుత్వము అనుసరిస్తున్నది. అయితే, గౌరవనీయ సభ్యులు వేసినటువంటి ప్రశ్నను పరీక్ష చేయాలంటే, అలాంటి repreesntation ఏదైనావస్తే. అప్పుడు ప్రభుత్వము local boards యొక్క ఆర్థిక పరిస్థితులను మనస్సులో పెట్టుకొని దానికి చేయగలిగిన మార్పులు చేయడానికి ప్రభుత్వమునకు ఏమి అభ్యంతరం లేదని మనవి చేస్తున్నాను.

Sri K. KRISHNA RAO :— Local Boards కు న్నూ, aided schools కున్నూ ప్రభుత్వము grants యిస్తున్నదికదా. అలాంటప్పుడు Government service లో graduate teachersకు యిస్తున్నటువంటి scales ను local board schools లోను, aided schools లోను ఉన్నటువంటి graduate teachers కు కూడ యిచ్చేటట్లు చేయకూడదా ? రెండవది నెల్లూరు teachers దీన్నిగురించి సంజీవరెడ్డిగారికి ఒక మహజరుయిచ్చారు. దీన్నిగురించి యింకా ఎందుకు consider చేయలేదు.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO :—

మొదటిప్రశ్నకు జవాబు: — గవర్నమెంటులో ఉన్నటువంటి వారికిన్ని, aided schools లోను, Local Boards లోను ఉన్నటువంటివారికిని సమానమైన జీతాలివ్వాలని వారి సూచన. ఇది మంచిఅభిప్రాయమే కాని, గవర్నమెంటులో ఉన్నటువంటి ఆర్థిక పరిస్థితులను, తరువాత Local Boards యొక్క ఆర్థికపరిస్థితులను పరీక్షచేసి చూచినట్లయితే, ఉదాహరణకు చిత్తూరు అనంతపురం, పశ్చిమగోదావరి, ఈ Local Boards యొక్క ఆర్థికపరిస్థితులు compare చేసి చూచినట్లయితే, యివి చాలా హీనస్థితిలో వుంటాయి. అటువంటప్పుడు అన్నిటికి ఒకేవిధంగా చేయుటకు కష్టంగాయుంటుంది. అందుకోసం ఈ విషయంలో ఏదైనా అభ్యర్థనవస్తే, అది ఎలాచేయడానికి సాధ్యమౌతుందో ఆలోచనచేసి తగువిధంగా చేయుటకు ప్రయత్నిస్తాము.

రెండవప్రశ్నకు జవాబు:— సాధారణంగా మంత్రులకు కొన్ని వందల applications, representations వస్తూఉంటాయి. అవన్నీ పరీక్షచేయవలసి వుంటుంది. ఇతర మంత్రులకు petitions యిచ్చినపుడు, వాటిని నాకు పంపించవలసియుంటుంది. మరల నేను దానిని

D. P. I. కి పంపించవలసియుంటుంది. ఈ విధంగా కొంత time తీసుకొంటుంది. కనుక యిటువంటి విషయాలలో కొంత ఓపికతో ఉండాలని మనవిచేస్తున్నాను.

Sri P. PUNDARIKAKSHACHARYULU:— అధ్యక్షా, ప్రశ్నలో రెండవ భాగానికి మంత్రిగారు సమాధానమిస్తూ టీచర్లకు pay scales యివ్వడములో అది లోకల్ బోర్డులయొక్క 'financial position సంబంధించించి వుంటుందని చెప్పారు. అటువంటప్పుడు యీ లోకల్ బోర్డు కాకుండా యింకా ప్రైవేటు మేనేజిమెంటులో వుండే స్కూల్సు కొన్నివున్నవి. అటువంటి స్కూళ్ళలో పనిచేసే స్కూలు టీచర్లకుకూడా గవర్నమెంటు pay scales తో బాటు సమానంగా యిస్తారా? లేక మార్పు వుంటుందా?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— అవి మరీ అధ్వాన్నంగా వుంటున్నవి. కారణమేమింటంటే, ప్రైవేటు మేనేజిమెంటులో వుండేస్కూళ్లు ఒక్కొక్కటి ఒక్కొక్కవిధంగా, రకరకాల పరిస్థితులలో నుంటున్నవి. అవన్ని ఒకేరకంగా లేవు. అందువల్ల ఆ స్కూళ్ళయొక్క ఆర్థిక పరిస్థితులనుబట్టి వుంటుంది. దానివిషయములో నేను యిదమిద్ధంగా చెప్పమంటే, all of a sudden చెప్పమంటే, చాలాకష్టం. దీనికి నాకు టైముయిచ్చి, వేరే ప్రత్యేక ప్రశ్న వేస్తే, జవాబు చెబుతాను.

Mr. SPEAKER:— The question hour is over.

*Training Classes to Willaqe Panchayat Presidents.*

* 302 Q.—Sri S. NARAYANAPPA:— Will the Hon. the Minister for Local Administration and Agriculture be pleased to state whether there is any proposal to conduct one week's training classes for the benefit of Village Panchayat Presidents ?

The Hon. Sri P. THIMMA REDDI:— There is no such proposal under the consideration of Government ?

15th March 1954]

*Hospitals in Yellavaram Agency Taluk.*

* 303 Q.—Sri Y. V. KRISHNA RAO :— Will the Hon. the Minister for Planning and Public Health be pleased of state :

(a) whether there is any representation made to the Government that hospitals be opened in Vatangi and Gurtedu village in Yellavaram Agency Taluk, East Godavari ; and

(b) If so the action taken thereon ?

The Hon. Sri D. SANJIVAYYA :—

(a) The answer is in the affirmative.

(b) The matter is under the consideration of the Government.

*Development of Nrsapur Port.*

* 304 Q.—Sri P. SYAMASUNDAR RAO :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state-

(a) whether the Government have received representations in regard to the development of the Narsapur Port ; and

(b) if so, the action taken thereon ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

Clause (a) The answer is in the affirnative.

Clause (b) The State Port Officer, Kakinada has been asked to examine the need for the construction of a wharf, which is one of the improvements suggested in the representation. As regards the other works suggested in the representation, a suitable reply explaining the position has been sent to the persons who made the representation.

*Subsidy to the Rural Medical Practitioners in the District Board Anantapur.*

* 305 Q.—Sri S. NARAYANAPPA :— Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state ;

(*a*) whether any memorandum has been submitted to the Government regarding the revival of subsidy to the Rural Medical Practitioners working in the District Board, Anantapur; and

(*b*) if so, the action taken thereon ?

The Hon. Sri D. SANJIVAYYA:—

(*a*) The answer is in the negative.

(*b*) This does not arise in view of the answer to clause (a) of the question.

*Point of order re: short notice question.*

Sri T. POTHA RAJU:— I rise on a point of order Sir, re. Short notice question విషయములో, నేను నాయొక్క explanation అధ్యక్షులవారికి మనవిచేయ దలచుకున్నాను.

Mr. SPEAKER:— How can this question arise now? The hon. Member can come into my Chamber and discuss the matter with me దీనిమీద నా అభిప్రాయము యివ్వడం జరుగుతుంది.

Sri T. POTHA RAJU:— మేము తీసుకొనివచ్చే short notice question ఏమిటో మీకు తెలియజేయటానికి, దానికి మంత్రులు నేరుగా జవాబుచెప్పటానికి మీరు వీలుకలిగిస్తే అటు తరువాతగదా మీ అభిప్రాయము యివ్వటానికి అవసరము వస్తుంది.

Mr. SPEAKER:— Let the question be discussed in my chamber. There is no question of point of order. There is no disorder in the business of the House now.

Sri T. POTHA RAJU:—నేను చెప్పదలచుకున్నది ఏమిటో చెప్పనివ్వండి. నా point of order. నేను యిచ్చిన short notice question కు సంబంధించిదిగా వుంటుంది.

Mr. SPEAKER:— The point is this. Point of order అంటే ఏమిటో తెలుసుకోలేకపోతే, ఏమిచెయ్యడం చెప్పండి. If the hon. Member wants anything to be cleared regarding short notice questions, he can come to my chamber and discuss the matter with me.

15th March 1954]

Sri T. POTHA RAJU :— Short notice question విషయములో నేను మాట్లాడుటకు point of order raise చేస్తే నాకు మాట్లాడటానికి అవకాశము లేకుండా చేస్తే ఎట్లా? నేను మనవి చేయదలచింది అధ్యక్షులవారికి తెలియజేయనివ్వండి. అటువంటి అవకాశము లేకుండా చేస్తే సభ్యులకున్న హక్కు భంగపరచడమవుతుంది. ఇప్పుడు మీరు నన్ను మాట్లాడనివ్వనందున నాయొక్క హక్కు భంగ పడింది. నేను question అనేది లేకుండా నేను సలహాయివ్వడానికి లేవాను. కాబట్టి దానికి సంబంధించిన procedure ను, సభ్యుల హక్కులను దృష్టిలోపెట్టుకొని నేను అధ్యక్షులవారికి appeal చేయటానికి లేచానుకాని, వేరొకటికాదు.

Mr. SPEAKER :—This does not come in as a point of order. The hon. Member must come to my chamber and explain the difficulty if any. అందుచేత, యిక్కడ యీ House లో యిప్పుడు జరుగుతున్న business కు వ్యతిరేకంగా ఇక్కడ point of order raise చేయవద్దు. మీరు చెప్పేది ఏమైనావుంటే, ఆ విషయమంతయు నాచేంబరులోపల నాకుచెప్పండి. ఇక్కడ houseలో వద్దు. Please take your seat. You can discuss the point with me in my chamber if you have any difficuly. I shall try to cooperate and solve the difficulty.

Sri M. VEERABHADRAM :— అధ్యక్షులవారు గడిలో వున్నప్పుడు మేమువచ్చి వారికి విన్నవించుకున్నప్పటికి కూడా, అది retcify కాకపోతే, మేము చేయవలసిన మార్గము ఏమిటి ?

Mr. SPEAKER :— This is a question of disorder and not a point of order.

*Adjournment Motion Re: Swami Sitaram's fast*

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా, నేను ఒక adjournment motion యిచ్చాను.

Mr. SPEAKER:—The Hon. Member should merely read the motion and unless I give my consent, he should not make a speech.

[ 15th March 1954

Sri PRAGADA KOTAIAH:—అధ్యక్షా, మీరు రూలింగు యిచ్చేముందు, నాకు మాట్లాడటానికి కనిసముగా నాలుగు నిమిషాలు టైముయివ్వాలి. నేను యీ motion విషయములో చెప్పవలసిన విషయాలు వున్నవి.

Mr. SPEAKER:—I will not allow the hon. Member to make a speech. He can merely read the motion.

Sri PRAGADA KOTAIAH:—Adjournment motion మద్యపాననిషేధం రద్దుకూడదని ప్రభుత్వానికి నచ్చచెప్పుటకై ప్రాయోపవేశ దీక్ష ప్రారంభించిన స్వామీ సీతారాం ప్రాణాపాయస్థితిలో వున్నందున ఏర్పడగల ప్రమాదపరిస్థితులను తొలగించుటకై ప్రభుత్వం సత్వర తీసుకొనదగు చర్యలను గూర్చి చర్చించుటకై యీ సభాకార్యక్రమమును వాయిదా వేయాలని ప్రతిపాదిస్తున్నాను.

Mr. SPEAKER.—I told the hon, Member in my Chamber that I could not allow this motion and I am giving my ruling.

"The Prohibition Act is still in force in the Andhra State. The fast now undertaken by Swami Sitaram, even if considered proper for achieving the desired object is therefore premature. The scrapping or otherwise of Prohibition is not the concern of the Government but is only that of the legislature. The motion is not maintainable and therefore disallowed."

Sri PRAGADA KOTAIAH:—అధ్యక్షా,———

Mr. SPEAKER:—No further speech. What is it on which the Hon. Member is going to say on this?

Sri PRAGADA KOTAIAH:— కనీసము నా తీర్మానంపై explanation క్రింద రెండుమాటలు మాట్లాడటానికి నాకు అవకాశమివ్వాలని కోరుతున్నాను.

Mr. SPEAKER.—No personal explanation. Where is the necessity for giving a personal explanation?

15th March 1954]

*Privilege Motion*

Mr. SPEAKER.—Now there is a notice of privilege motion by Sri Vavilala Gopalakrishnaiah. I shall take up that tomorrow.

Sri VAVILALA GOPALAKRISHNAIAH.—Tomorr w is a holiday, Sir.

Mr. SPEAKER.—Tomorrow means "nex t workin

II GOVERNMENT MOTION.

Motion under Rule 22 of the Madras Assembly Rules.

The Hon. Sri T. PRAKASAM :— Mr. Speaker Sir, I beg to move :-

"That under Rule 22 of the Madras Assembly Rules, the Demands for Grants for the year 1954-55 be taken in the following order, namely :-

| | | | |
|---|---|---|---|
| 1. | Demand No. | XXVII — | Electricity. |
| 2. | „ | VI — | Motor Vehicles Act. |
| 3. | „ | XXIV — | Civil Works-Works. |
| 4. | „ | XI — | District Administration and Miscellaneous. |
| 5. | „ | XXXII — | Community Development projects. |
| 6. | „ | XXI — | Industries. |
| 7. | „ | XX — | Co-operation. |
| 8. | „ | XVI — | Medical. |
| 9. | „ | I — | Land Revenue. |
| 10. | „ | XXIII — | Labour including Factories |
| 11. | „ | IX — | Heads of States, Ministers etc. |
| 12. | „ | XXII — | Harijan Uplift. |
| 13. | „ | XV — | Education. |
| 14. | „ | VIII — | Irrigation. |
| 15. | „ | II — | State Excise Duties. |
| 16. | „ | XIV — | Police. |
| 17. | „ | XIII — | Jails. |

and the remaining Demands will be taken up for discussion in the order given in the notice of list of Demands dated 1st March, 1954, already circulated, excluding the Demands mentioned above."

Mr. SPEAKER:—The motion is:

"That under Rule 22 of the Madras Assembly Rules, the demands for grants at for the year 1954-55 be taken in the following order, namely:-

| | | | |
|---|---|---|---|
| 1. | Demand No. | XXVII — | Electricity. |
| 2. | " | VI — | Motor Vehicles Act. |
| 3. | " | XXIV — | Civil Works-Works. |
| 4. | " | XI — | District Administration and Miscellaneous. |
| 5. | " | XXXII — | Community Development projects. |
| 6. | " | XXI — | Industries. |
| 7. | " | XX — | Co-operation. |
| 8. | " | XVI — | Medical. |
| 9. | " | I — | Land Revenue. |
| 10. | " | XXIII — | Labour including Factories |
| 11. | " | IX — | Heads of States, Ministers etc. |
| 12. | " | XXII — | Harijan Uplift. |
| 13. | " | XV — | Education. |
| 14. | " | VIII — | Irrigation. |
| 15. | " | II — | State Excise Duties. |
| 16. | " | XIV — | Police. |
| 17. | " | XIII — | Jails. |

and the remaining demands will be taken up for discussion in the order given in the notice of list of Demands dated 1st March, 1944, already circulated, excluding the Demands mentioned above."

The Motion was carried.

Sri C. V. K. RAO.—On a point of information, Sir. May we know what time is allotted for the different Demands and also when particular Demands will be taken up for discussion?

Mr. SPEAKER.—Apparently the hon. Member had a long holiday. All this has been arranged and Members have been duly informed.

Sri C .V. K. RAO.—May I now which Demands will be finished to-day?

The Hon. Sri N. SANJIVA REDDI.—The order of the Demands and number of hours to be devoted to each Demand has been fixed. To the extent we finish to-day is all that can be said now.

Sri PILLALAMARRI VENKATESWARLU .— మనము Demands క్రింద time stipulate చేసుకోకుండా ప్రారంభ మవుతున్నాము. అందువల్ల యీ Electricity Demand కు కైము "యింత" అని fix చేసుకుంటే బాగుంటుంది.

Mr. SPEAKER.—We may know our progress only after we assembly after lunch. We shall now take uq Demand No. XXVII.

## BUDGET FOR THE YEAR 1954-55

### Voting of Demands for Grants for 1954-55.

### Demand No. XXVII-Electricity.

The Hon. Sri N. SANJEEVA REDDI.—Mr. Speaker, on the recommendation of the Governor I beg to move;

"That the Government granted, లో a sum not exceeding Rs. 93,37,3000 under Demand No. XXVII-Electricity."

అధ్యక్షా, విద్యుశ్ఛక్తి సరఫరాక్రింద వీలున్నంతవరకు, రాష్ట్రము లోని అన్ని మూలలకు, అన్ని ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయా లన్న విషయంలో ప్రభుత్వంగాని, ప్రతిపక్షంగాని యేమీ అభిప్రాయ భేధంలేదు. అది అందరూ అంగీకరించవలసి వుంటుందని అందరికీ తెలుసు. వీలున్నంతవరకు దీనిని రాష్ట్రంలో అన్ని ప్రాంతములకు సరఫరా చేయా

Sri N. Sanjeeva Reddi ] [ 15th March 1954

లని మా వుద్దేశ్యము. Composite Madras State లో వున్నప్పుడు, electricity schemes విషయంలో, ఆంధ్రరాష్ట్రం చాలా వెనుకబడి వున్నది. ఇప్పుడుకూడా మద్రాసు రాష్ట్రంతో పోల్చి చూచినట్లయితే, ఆంధ్రరాష్ట్రంలో విద్యుచ్ఛక్తి సరఫరా స్కీములు చాలా వెనుకలో వున్నవి. మాచ్‌ఖండ్, తుంగభద్ర మొదలైన electricity schemeలు పూర్తిచేసుకుంటే, మన రాష్ట్రంకూడా అదేవేగంతో ముందుకు పోవడానికి వీలవుతుంది. ఇప్పుడు మన రాష్ట్రంలో మాచ్‌ఖండ్‌లోగాని, తుంగభద్రలోగాని నెల్లూరు, చిత్తూరు, హిందుపూరు మొదలైన స్కీములు, డీజెల్ స్టేషన్సు మైసూరువారు యిచ్చే electricty మద్రాసువారు యిచ్చే electricity మొత్తం చూచుకుంటే, దాదాపు 33,100 కిలో వాట్స్ పవరు రాష్ట్రంలో సరఫరా అవుతోంది. ఇది చాలా కొద్ది విద్యుచ్ఛక్తి మాత్రమే. కనుక, మనకు యింకా చాలాకావలసి వున్నది. మనం మాచ్‌ఖండ్ హైడ్రో ఎలిక్ట్రిక్ పవర్‌స్కీము పూర్తి చేసుకొన్న తరువాత, రాష్ట్రంలో చాలా ప్రాంతాలకు, చాలా జిల్లాలకు సరఫరా చేసుకొనుటకు, దాదాపు ఒంగోలువరకు దానిని తెచ్చుకొనడానికి వీలవుతుంది. వెంటనే కాకపోయినా, ఆ విద్యుచ్ఛక్తిని మనం స్వాధీనము చేసుకొని, పూర్తిగా వుపయోగపడడానికి వీలవుతుంది. ఈ తుంగభద్ర Hydro Electric Power త్వరలోనే పూర్తిఅయి మన స్వాధీనము అవుతుందని చెప్పడానికి వీలులేదు. అది రెండురాష్ట్రాలకు సంబంధించినది. అది తుంగభద్ర బోర్డు స్వాధీనములో వున్నది. మనకు యింటికి, ఎనుబదిపాళ్లు హక్కు అందులో వున్నది. ఇరువది పాళ్ళు మాత్రమే మైసూరు రాష్ట్రమునకు హక్కువుంది. ఆ power నంతా పూర్తిగా రాష్ట్రంలో సరఫరా చేయడానికి, రెండుమూడేండ్లలోగా వీలవుతుంది. అన్నిజిల్లాలకు అందరకూ supply చేస్తామని చెప్పడం కష్టంగాని, ఆయా జిల్లాలలో హెచ్చు భాగమునకు యీ తుంగభద్ర విద్యుత్ శ్ఛక్తి స్కీములద్వారా, ముఖ్యంగా రాయలసీమ జిలాలకు, విద్యుత్ శ్ఛక్తి వుపయోగపడుతుంది. ఈ విద్యుత్ శ్ఛక్తి స్కీములు వున్నవన్ని మనకుతోడ్పడేటట్లుగా, వాటిని సమన్వయపరచేటట్లుగా, కావలసిన కార్యక్రమము నాతను ప్రభుత్వము చేస్తుంది. Electricity తయారైన నాడే యేర్పాట్లు చేసుకొనడం

మంచిది. ఆ electricity తయారయినప్పుడు యీ రాష్ట్రంలోవున్న అన్ని ప్రాంతాల్లో, ఏలైన అన్ని ప్రాంతాలకు, మనకు కావలసిన సిబ్బంది, సామగ్రి చేకూర్చుకుంటే, ఆ రెండు ప్రాంతములలో తయారయ్యే విద్యుత్ శక్తిని మనం వుపయోగం చేసుకోవచ్చు. మాచ్ ఖండ్ ద్వారా, ఒకలక్ష. కిలోవాట్స్ తయారుచేసుకో గల్గుతాము. 1955 సంవత్సరములో మధ్య, 56 లక్షల power తయారు చేసుకోగల్గుతాము. ఆ తరువాత; ఆ ప్రాజెక్టు కార్యక్రమాలు పూర్తిగా ముగించుకొన్న వెంటనే ఒక లక్ష కిలోవాట్స్ power సంపాదించుకో గల్గుతాము. మాచ్ ఖండ్ ప్రాజెక్టుకూడా, యిక్కడ ఆంధ్రకు, అక్కడ ఒరిస్సాకు సంబంధించినది. ఒరిస్సాకు కొద్దిభాగము, ఆంధ్రకు హెచ్చు భాగము యిచ్చి, యింకా కొంచెం percentage తో 99 యేండ్లకు మనకు lease గా యివ్వడానికి ఆరాష్ట్రంవారు ఒప్పుకున్నారు. అక్కడకూడా దాదాపు 80 పాళ్ళు ఈ రెండు స్కీములు పూర్తి అయ్యేసరికి, కొన్నికొన్ని ముఖ్యమైన మూలప్రాంతాలలోకూడా diesel stations పెట్టి అక్కడకు electricity supply చేస్తూ తుంభద్ర మాచ్ ఖండ్ పవర్ వచ్చేనాటికి ఆలస్యంలేకుండా lines connect చేసుకొనడము సులభమని ప్రభుత్వము గుర్తించింది. ఈ demands లోని ఖర్చుఅంతా maintenance కు సంబంధించినదే. Demand XXXVII లో హెచ్చు భాగము Capital Outlay క్రింద ఆ demand లో ముఖ్య ఖర్చులు వస్తాయి. ఈ demandworking expenture అక్కడక్కడ diesil station కు సంబంధించిన ఖర్చులు యిందులో వున్నవి. మరొక ముఖ్యమైన విషయం చెప్తాను. ఈ Demand లో ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టి, యింకాకొంచెము lines గ్రామాలకు connect చేస్తే మంచిది. వెంటనే electricitysupply చేయలేక పోవచ్చు గాని, డబ్బు ఖర్చు అవుతుందనే జంకు లేకుండా యిప్పుడు electricity కావాలన్న ప్రతిప్రాంతానికీ lines connection కనీసము యిచ్చి, రాబోవు సంవత్సరము విద్యుచ్ఛక్తి సరఫరా చేయవచ్చు. మాచ్ ఖండ్ power తయారయ్యేసరికి 77,600 కిలోవాట్స్ తయారు కావడానికి సాధ్యమవుతుందని నాకు యిక్కడ సంఖ్యలు యిచ్చారు. 1961 సంవత్సరమునకు 1,30,000 కిలోవాట్స్ రావడానికి వీలుపడుతుందని అంచనా వేస్తున్నారు. దీనినంతా

కూడా Five Year Plan లో చేర్చి 2,68 లక్షలు రూపాయలు ఖర్చు చేయబడుతుంది. చిన్నచిన్న deisel station పెట్టె ప్రణాళికల కే గాక, యీ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడిన స్కీములకు కూడ ఎంతో మొత్తం ఖర్చు అవుతుంది. ఇదిగాకుండా మన రాష్ట్ర revenue లోంచి ఖర్చుపెడుతున్న మొత్తాలు వున్నవి. ఇప్పుడు యీ Demandలో maintenance మటుకే ఖర్చు పెట్టబడుతున్నని మొత్తాలువున్నవి. ఇప్పుడు ఈ డిమాండులో maintanance మటుకే ఖర్చుపెట్టబడుతుంది. విద్యుచ్ఛక్తి ఏఏ గ్రామాలకు ఏఏ తాలూకాలకు చేర్చడమనేది తేలే వరకు నేను యిక్కడ చెప్పలేను కాని, గతసంవత్సరం యీ voluntary loans policy ని apply చేస్తూ చేయడంవల్ల చాలా గ్రామాలలో electricity supply చేయుటకు నిర్ణయించు కొనికూడా, ప్రభుత్వము ముందుకు తీసుకులేకపోయింది. Sanction అయిన schemeలు అన్నికూడా నిలుపుదల చేయబడ్డాయి. ఈ ఆంధ్ర రాష్ట్రం వచ్చిన తరువాత, చేయగల్గినంతవరకు యివ్వగల్గిన గ్రామాలకు యిచ్చి voluntary loans ను రద్దుచేసిన విషయం మీ కందరికీ తెలుసు. Budget లో sanction అయిన మొత్తాలలో యెన్ని యెన్ని గ్రామాలకు మనం యివ్వగల్గుతామో, యెన్ని యెన్ని గ్రామాలకు విద్యుత్ శ్ఛక్తి సరఫరా చేయ వీలవుతుందో వెంటనే దర్యాప్తు చేయవలసి నదిగా కోరుతూ Chief Engineer కు ఉత్తర్వులు పంపాము.

బడ్జెట్‌లో sanction అయిన మొత్తంవల్ల ఏయే గ్రామాలవారికి ఎంతెంత విద్యుచ్ఛక్తి మనం సరఫరా చేయకలుగుతామో చూచుకో వాలి. ఇప్పుడు అన్ని ప్రాంతాలకు ఒకేసారి సరఫరా చేయాలంటే దానికి కొంత essential meterial కావాలి. మనకు ఇక్కడ లభ్యం కాని వస్తువులు ఎన్నో మనం విదేశాలనుంచి తెప్పించుకొంటున్నాం. అవి మనదేశంలో దొరికేవి కావు. వాటివల్ల ఈ విద్యుచ్ఛక్తి అన్ని ప్రాంతా లకు అందచేయడంలో చాలా విలంబన జరుగుతోంది. ఈ విలంబనకు ప్రభుత్వం బాధ్యత వహించడానికి వీలులేదు. వీలైనంత వరకు అన్ని ప్రదేశాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయాలనే మన అందరి యొక్క

ఆశయం, అభిలాష. ఇప్పుడు 23 ఎక్స్టెన్షన్ స్కీంలు రాష్ట్రములో అమలులో ఉన్నాయి. అందుకుగాను sanctioned estimates 84.32 లక్షలు. ఇవి 76 గ్రామాలకు ఉపయోగపడతాయి. ఆ గ్రామాలలో 77 మైన్స్ ఉన్నాయి. నాలుగ్రిక ల్చిస్ట్రిబ్యూషన్ను రద్దుచేయడంవల్ల ఇంకో కోటి రూపాయలు ఖర్చుపెట్ట నిశ్చయించుకొని ఈ ఎక్స్టెన్షన్ స్కీములను 1954-55 లో జోరుగా ముందుకు తీసుకుపోతాం అని ఆశిస్తున్నాను. కాని ఈకోటి రూపాయలు చాలా తక్కువ. ఇంకా విద్యుచ్ఛక్తి ఇవ్వ వలసిన ప్రాంతాలు చాలా వున్నాయి. ప్రస్తుతం మన రాష్ట్రంలో ఉత్పత్తి అయ్యేది చాలక మైసూరునుంచి మద్రాసునుంచి తీసుకుంటు న్నాం. మాచ్ ఖండ్ నుంచి కాని, తుంగభద్రానుంచి విద్యుచ్ఛక్తికాని అందని ప్రదేశాలు కొన్ని ఉన్నాయి. అలాంటి ప్రాంతాలకు మద్రాసు నుంచి, మైసూరునుంచి తీసుకుంటాం. చిత్తూరుజిల్లాలోని కొన్ని ప్రాంతాలకు మద్రాసునుంచి తీసుకొని ఇప్పుడు సరఫరా చేయడం జరుగుతున్నది. ఇప్పుడు ఇచ్చేదానివల్ల చిత్తూరుజిల్లా అంతకూ సరఫరా చేయడం కష్టం. ఇంకా కొంత తీసుకోవలసి ఉంటుంది. అందుచేత మన చీఫ్ ఇంజనీరుగారు మద్రాసు చీఫ్ ఇంజనీరుగారితో సంప్రతింపులు చేస్తు న్నారు. మద్రాసు ప్రభుత్వం వారుకూడా ఒక నిర్ణయానికి వచ్చిన తరువాత ఒక వెయ్యికాని రెండువేలు కిలోవాట్లుగాని వారు ఇవ్వగలిగితే చిత్తూరు ప్రాంతం అంతకూ ఇవ్వకలుగుతాం. తరువాత మన చీఫ్ ఇంజనీరుగారు మైసూరు చీఫ్ ఇంజనీరుగారితో సంప్రతింపులు జరుపుతున్నారు. అక్కడ నుంచి తీసుకొన్నదాన్ని ఈ దగ్గరలోఉన్న కర్నూలు, కడప, అనంతపురం జిల్లాలకు ఉపయోగపడేటట్లు కృషిచేస్తున్నాం. ఆ కృషి ఫలిస్తే ఈ తుంగభద్రమీద ఆధారపడకుండా వచ్చే రెండు సంవత్సరాలలో ఎన్నో ప్రాంతాలకు ఇవ్వకలుగుతాం. హిందూపురం తాలూకాకు, పావుగడలో ఒక స్టేషన్ కట్టడానికి ఆలోచనలో ఉంది. అది పూర్తయితే హిందూ పురం తాలూకాలో చాలా గ్రామాలకు ఇవ్వడం జరుగుతుంది. ఇప్పటికే సిద్ధన్నగౌడు మైసూరులో చేరాలని అంటున్నారు. కాబట్టి వాళ్ళు connection ఇస్తారని ఆశిస్తున్నాను. అది త్వరగా సాధ్యం అయితే ఎంతో సంతోషిస్తాం. ఇప్పుడు థర్మల్ స్టేషన్నువల్ల డీసెల్ స్టేషన్నువల్ల

Sri N. Sanjeeva Reddi] [15th March 1954

చాలామట్టుకు విద్యుచ్ఛక్తి తయారుచేస్తున్నాం. దీనివల్ల చాలా ఖరీదుఅవుతున్నది. దీనికి కావలసినసామాను బొగ్గు మొదలైనవిచాలా ఖరీదుగా నేడున్నాయి, వీటివల్ల తయారుచేసే విద్యుచ్ఛక్తిని తక్కువ ఖరీదుకు నష్టంలేకుండా ఇవ్వడం సాధ్యంకాదు. టెక్నికల్ గా దానికి నాలుగురెట్లు ఖరీదు ఎక్కువ అవుతుంది. కాబట్టి నాలుగింతల ఖరీదు ఎక్కువపెట్టి రైతులకు సప్లయి చేయడం సాధ్యంకానిపని. ఏమైనప్పటికి విద్యుచ్ఛక్తి కార్యక్రమం చాలా చురుగ్గా సాగుతోందని నేను మీకు విన్నవిస్తున్నాను. చీఫ్ ఇంజనీర్ గారు, మిగతా ప్రభుత్వోద్యోగులుకూడా చాలా ఉత్సాహంతో పనిచేస్తున్నారు. వారు ఎన్ని అడ్డంకులు వచ్చినా వాటిని ఎదుర్కొని ప్రజలకు విద్యుచ్ఛక్తిని సప్లయి చేయుటకు ప్రయత్నిస్తున్నారని చెప్పడానికి నేనుఎంతో సంతోషిస్తున్నాను. విద్యుచ్ఛక్తి విషయంలో వెనుకబడిన రాష్ట్రంమనది. రాష్ట్రం ఏర్పడిన తరువాత మద్రాసు రాష్ట్రంతో సరి సమానంగా తులతూగాలనే ఆపేక్ష మనలో కలిగింది. దానికోసం పని చేయాలని అందరిలోను ఉంది. డబ్బు ఖర్చు అయినా ఎక్కువ గ్రామాలకు సప్లయి చేయాలని ప్రభుత్వం కృషిచేస్తున్నది. ఇప్పుడు మొత్తం మీద 37,100 కిలోవాట్లు సప్లయి చేస్తున్నాం. ఇందులో 5,880 కిలోవాట్లు తప్ప మిగతాదంతా కూడా థర్మల్ స్టేషన్ను ద్వారా ఉత్పత్తి అవుతున్నది. అందుచేత చాలా ఖర్చు ఎక్కువ అవుతున్నది. వచ్చే సంవత్సరానికి మనం మాచ్ ఖండ్ నుంచి విద్యుచ్ఛక్తి తెచ్చుకోకలిగితే తక్కువధరలకు ఈ విద్యుచ్ఛక్తి సరఫరా చేయకలుగుతాం అని ఆశిస్తున్నాను.

విద్యుచ్ఛక్తి సరఫరాలో ప్రభుత్వం నష్టంపొందే అవకాశంలేదు. ఈ వ్యాపారం అటువంటిదికాదు. కాని మనం రైతుకు ఉపయోగపడే కార్యక్రమాన్ని ఎంతత్వరగా సాధించగల్గితే అంత మంచిదనే ఉద్దేశ్యంతో వున్నాము. ఈరోజున ఎక్కువ ఖర్చుపెట్టగలిగే స్థితిలో కూడా మనంలేము. Percentage of return హెచ్చుగా వుండినా మనదగ్గరవున్న డబ్బు చాలా తక్కువైనందువల్ల యిప్పుడు ఎక్కువ మనం ఖర్చుపెట్టలేకపోయినా మనం అనుకున్న 4 systems ను అభివృద్ధి పర్చుకుంటే, హెచ్చు ఆదాయాన్ని పొందగల్గుతాము. అప్పుడు రైతులకు, వ్యాపారస్తులకు, ఫాక్టరీలకు యెక్కువఉపయోగం

చేకూర్చగలం. వెంటనే యెక్కువ ఖర్చుపెట్టడంవల్ల నష్టంలేదని తెలిసివున్నా 1 కోటిరూపాయలుకంటె యెక్కువ ఖర్చుపెట్టలేకుండావున్నాము. ఖర్చుపెడితే తగిన ఫలితాన్నిస్తుందని అందరు అంగీకరించిన విషయమే. అనేక యిబ్బందులకు గురిఅవుతున్నా, యితర విషయాలెట్లున్నా దీనికెక్కువ ప్రాముఖ్యం యివ్వాలని ప్రభుత్వం ఒక నిర్ణయానికి వచ్చింది. వ్యవసాయపు పనులకు. ఆస్పత్రులకు, వీధి దీపాలకు అత్యున్నతమైన ప్రాముఖ్యంయిచ్చి, విద్యుచ్ఛక్తి సరఫరా చేయాలని ప్రభుత్వం సంకల్పించింది.

నిజంగా బెజవాడ థర్మల్ స్టేషనులో ఉత్పత్తిఅవుతున్న విద్యుచ్ఛక్తి అక్కడి ప్రజలకే చాలడంలేదు. మాకు విద్యుచ్ఛక్తి సప్లయి చెయ్యాలనే డిమాండ్లకు ప్రభుత్వం సరఫరా లేకుండావుంది. అక్కడ యింకా యెక్కువ విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచెయ్యడానికి ఈమధ్య ఒక క్రొత్తమిషను కొనాలని చీఫ్ యింజనీరుగారు సలహాయిచ్చారు. దానికి ప్రభుత్వం అంగీకరించింది. మెషినరీకి టెండర్లు పిలవడము వగైరాపనులు చేస్తున్నారు. థర్మల్ స్టేషనులో మనం యెన్ని ఇంజన్లుపెట్టి పనిచేయించినా, మనకు సప్లయి విషయంలో తృప్తికరంగా వుండదు. థర్మల్ స్టేషన్లద్వారా విద్యుచ్ఛక్తిని దూరప్రాంతాలకు తీసుకుపోవడం సాధ్యం కాదు. అట్లాగని యిప్పుడే హైడ్రో ఎలక్ట్రిక్ పవరును సప్లయిచేయడం సాధ్యంకాదు. ఈ రెండింటిని సమన్వయపర్చుకుని రేపు రాబోయే హైడ్రోఎలక్ట్రిక్ పవర్‌కు లైన్సువగయిరా సిద్ధంచేసుకోవచ్చు. దీనికి ఒక చిక్కుసమస్యవుంది. దీనిని అతిజాగ్రత్తగా పరిశీలించి ఇంజనీర్లు, ఉద్యోగస్తులు కృషిచేస్తున్నారని ప్రభుత్వంతరపున మనవిచేస్తున్నాను. దీంట్లో విలంబనగాని ఒక ప్రాంతంపై అభిమానం వుండడము, మరొక ప్రాంతంపై అభిమానం లేకపోవడముగాని లేదు. ఆచార్యులవారు తమాషాగా అడిగిన ప్రశ్నకు తమాషాగా సమాధానం చెపితే, కాంగ్రెసువారు సభ్యులుగా వున్న చోట్ల చేస్తున్నట్లు, లేనిచోట్ల చెయ్యనట్లు కాదు. బెజవాడలో నిజంగా కాంగ్రెసు సభ్యులు లేకపోయినప్పటికి విద్యుచ్ఛక్తి సరఫరా చేస్తున్నాము. ఏసభ్యుడు ఎక్కడనుంచి వచ్చినా ఆయాప్రాంతాలు మీకెంత ముఖ్యమో, నాకూఅంతే ముఖ్యం. ఏదైనా పనిచేస్తే రాష్ట్రం మొత్తం దృష్టిలోపెట్టుకుని చేయాలని చూస్తున్నాము.

కదిరి తాలూకాలో చిన్న స్టేషన్ పెట్టాము. అట్లా చెయ్యడంలో వేమారెడ్డిగారు కాంగ్రెసువారని కాదు. ఈ స్కీము 1949 లో నేను మంత్రిగా వున్నప్పుడు పరిశీలనకువచ్చి, తిరిగి యిప్పుడు నా చేతితోనే పూర్తిచేసే అవకాశం వచ్చింది. పెనుగొండలో కూడా ఆ విధంగా చెయ్యగల్గితే యెంతో సంతోషిస్తాము. మాకేటువంటి దురభిప్రాయాలు లేవు. ఆ విధంగా దురభిప్రాయాలు మీరెవరూ పెట్టుకోవద్దని మనవిచేస్తున్నాను. పరిస్థితులనుబట్టి ఏయే తాలూకాలలో, ఏయే ప్రాంతానికి విద్యుచ్ఛక్తి కావాలో చూచి అన్ని ప్రాంతాలకు కనీసం 4, 5 ఏండ్లలో సరఫరా అయ్యేపథకాలు వేసుకుని చూసుకుందామని ఆలోచిస్తున్నాము. ఇటువంటి ఉద్దేశ్యంతోనే నేనెప్పుడూ ఆలోచిస్తూ, ఇంజనీర్లకు ఆదేశాలిస్తున్నాను.

ఇప్పుడు ఒక్క electrification కు మాత్రమే యెక్కువడబ్బు ఖర్చుపెట్టలేము. ఈ డిమాండుక్రింద అన్నిటికి కలిపి రెవెన్యూ అకౌంట్లు నుంచి 84 లక్షలు యిస్తున్నాము. దీనికి కావలసిన డబ్బంతా ఇప్పుడు ఖర్చుపెట్టగలిగితే, కార్యక్రమమంతా సులభంగా చేసుకోవచ్చు. కాని ఇప్పుడు అంతడబ్బు ఖర్చుపెట్టలేము. ఇంకా irrigation మొదలైన యితర ముఖ్యకార్యక్రమాలు లున్నాయి. ఇంకొక రెండు మూడు కోట్లు రూపాయలు యీ పద్దుక్రింద ఖర్చుపెట్టగల్గితే మీరు సంతోషిస్తారని నాకు తెలుసు. విద్యుచ్ఛక్తిపద్దుకు యిది చాలా కొద్దిమొత్తమని నాకు తెలుసు. ఇది నష్టముగాని, నష్టముగాని అయ్యే డిపార్టుమెంటుకాదు. దీనిలో wastage ఎక్కువ వుండడానికి సావకాశంలేదు. అప్పులుచేసి చెయ్యరాదా అనవచ్చు. అన్నింటికీ అప్పులేఅవుతున్నాయి. అప్పులు కూడా మితిమీరి చెయ్యకూడదు. ఇప్పుడు ప్రారంభం అయిన కార్యక్రమంలో కనీసం రానున్న 4, 5 సంవత్సరాలలో మన రాష్ట్రం అంతటా ఉపయోగపడేటట్లు చూద్దాము.

Cut motion లలో చాలావరకు మా గ్రామానికి విద్యుచ్ఛక్తి రాలేదంటే, మా గ్రామానికి రాలేదనిపంపించారు. విద్యుచ్ఛక్తి రాకపోయింది మీ మీ గ్రామాలకే కాదు, ఇంకా చాలా గ్రామాలున్నాయి. మీ మీ గ్రామాలలో విద్యుచ్ఛక్తిలేదని ప్రభుత్వదృష్టికి తెచ్చారు. బాగానే వుంది. ఇక ప్రభుత్వ కార్యక్రమాలను బలపరుస్తూ, యీ డిమాండును

ఏకగ్రీవంగా ఆమోదించమని కోరుతున్నాను. మీ అభిప్రాయాలేమైనా వుంటే తెలియపర్చండి. పనులు చేయించడంలోగాని, ఇతర విషయాలలోగాని మా దృష్టికి తీసుకురాదలచినవివుంటే తెలియపర్చండి. వాటిని నేను note చేసుకుని, ఎటువంటిలోపాలు యికముందు రాకుండా సరిచేస్తాను. మీమీ తాలూకాలలో విద్యుచ్ఛక్తిలేదని మీరు చెప్పనక్కరలేదు. ఈ లెక్కలన్నీ నాదగ్గరే వున్నాయి. డిపార్టుమెంటులో జరిగే పనులలో లోపాలువుండవచ్చు. వాలంటరీ లోనువల్ల ఆపుచేయబడిన గ్రామాలన్నింటికీ విద్యుచ్ఛక్తియిప్పడిన్నారు. శ్రీ భద్రంగారు మాచ్ ఖండ్ లోవున్న కూలీలకే యిబ్బందులున్నట్లు చెపుతారు. ఇప్పుడే వాటినిగురించి యెత్తుకుంటే, వారి ఉపన్యాసంలో యీ విషయాన్ని గురించి కొంతవరకు తగ్గించుకోవచ్చు. అక్కడ కూలీలకు కొన్నికొన్ని ఉపకారాలు చెయ్యడానికి కృషిచేస్తున్నాము. ఒరిస్సా మంత్రులు సూపరింటెండింగ్ యింజనీరుతో మాట్లాడిన తర్వాత వాటినిగురించి శ్రద్ధతీసుకుని మన చీఫ్ ఇంజనీరు వగైరాలు ఏర్పాట్లుచేస్తున్నారు. వారికికూడా సాధ్యంకాని విషయాలుంటే నేను ఏప్రిల్ లో ఒకసారి మాచ్ ఖండ్ కు పోయి చీఫ్ ఇంజనీరుగారితోను, సూపరింటెండింగ్ ఇంజనీరుగారితోను సంప్రతించి చిన్నచిన్న యిబ్బందులుంటే తీర్చడానికి ప్రయత్నంచేస్తాను. అక్కడ కొన్నివేల మంది పనిచేస్తున్నారు. వారికి కావలసిన వసతులు, వగైరా సౌకర్యాలు కలుగజేసి, వారిని సుఖంగా వుంచాలనే నావుద్దేశ్యము. ఆ వుద్దేశ్యంతోనే మాచ్ ఖండ్ కు పోతున్నాను. ఇంతకంటె యీ డిమాండు మీద details యివ్వలేను. అట్లా యివ్వడంవల్ల complications రావచ్చు. కాబట్టి యీ డిమాండును హృదయపూర్వకంగా బలపరచమని కోరుతూ, దీనిని ప్రతిపాదిస్తున్నాను.

Mr. SPEAKER:—The motion is:

That the Government be granted a sum not exceeding Rs 93,37,300 under Demand XXVII—Electricity.

There are as many as 21 cut motions under this Demand. Hon. Members who have given notice of cut motions may move their cut motions formally, and afterwards I shall take up one or two cut motions and put them to the vote of the House.

Sri P. PUNDARIKAKSHACHARYULU: Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 93,37,300 under Electricity by Rs. 100

Sri S. VEMAYYA: Mr. Speaker, Sir, I beg to move;

To reduce the allotment of Rs. 93,37,300 for Electricity by Rs. 100.

Sri K. KRISHNARAO: Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 93,37,300 for Electricity by Rs. 100.

Mr. SPEAKER:-The other cut motions given notice of by Sri V. Gopalakrishnaiah, Sri K. Ranga Rao, Sri T. Lakhminarayana Reddi, Sri P. Narasimha Reddi, Sri M. Veerabhadram, Sri P. S. Ramachendra Rao, Sri S. Kasi Reddi, Sri P. Venkateswarlu, Sri M. Hanumantha Rao, Sri Kolla Venkaiah, Sri D. Seetharamaiah, Sri K. V. Ramesam, Sri Y. V. Krishna Rao, Sri R. Siddhanna Gowd, and Sri B. Sankariah may be taken as moved. The first speaker will have 20 minutes and the rest will have 7 minutes each.

* Sri K. KRISHNA RAO:— అధ్యక్షా! ఈ electricity demandకు కోతతీర్మానాన్ని బలపరుస్తున్నాను. ఈడిపార్టుమెంటులో వున్న workers కు చాల తక్కువజీతాలు యిస్తున్నారు. కొన్ని సంవత్సరములనుంచి increments యివ్వడం లేదు. వాళ్ళకు wages కూడా చాలా తక్కువగాను, పనిభారం ఎక్కువగాను ఉంటున్నది. పని ఎక్కువయి electricity ఉత్పత్తి ఎక్కువగా ఉన్నాకూడా వారికి wages ఎక్కువగా యిచ్చుటలేదు. ఇది ఏవిధంగా వున్నది అంటే number of units జాస్తి అవుతున్నప్పుడు సాధారణంగా generated units — — —

Mr. SPEAKER:—We adjourn to-day at 1 p. m. and re-assemble at 3 p. m.

15th March 1954]

The Hon. Sri N. SANJEEVA REDDI:-May I know when we adjourn for the day in the evening?

Mr. SPEAKER. At 6 p. m.

Sri T. NAGI REDDI:—Obviously the Hon. Minister does not want to say that he is leaving Kurnool this evening by train. So, I suggest that we may re-assemble at 2-30 p. m. instead of at 3 p. m. and rise for the day at 5-30 p. m. so that the Hon. Minister may have time to catch the train.

The Hon. Sri N. SANJEEVA REDDI:—I do not want to inconvenience the House. I shall make arrangements to catch the train at Nandyal.

Mr. SPEAKER:-Instead of all that, the House will rise at ten minutes to six in the evening, so that the Minister may have 20 minutes at his disposal.

(The House agreed to this arrangement.)

Sri K. KRISHNA RAO :— అధ్యక్షా! ఈ విషయాన్ని కొన్ని కొన్ని పరిస్థితులలో చూస్తే, numbe of units కు వచ్చే ఆదాయం జాస్తిఅయినవి. కాని workers యొక్క wages పెరగకుండా తగ్గడం కన్పిస్తోంది. Vishakapatnam thermal station లో number of units, 7.40 millions నుండి, 10.68 millionsకు పెరిగింది. కాని వర్కర్స్‌కు wages, establishment ఖర్చు 1.39 నుంచి 1.31 కు తగ్గింది. ఇంతేకాకుండా, ఇదివరలో విజయవాడ thermal station లో 14 మిలియన్ల యూనిట్ల electricity generate అయితే ఇప్పుడు 18 మిలియన్ల 80 లక్షల యూనిట్లు అయినది. Workers జీతాలు మాత్రం పెరగకుండా 1.65 లక్షలు అలాగే సమానంగా వున్నది. వచ్చిన ఆదాయం 7 లక్షల 30 వేల నుంచి ,3 లక్షల 5 వేలవరకు జాస్తి.అయినది. హెచ్చుగా ఆదాయంవస్తున్నా హెచ్చుగా electricity ఉత్పత్తి అవుతున్నా, workers కు యిస్తున్న wages మాత్రం యథాప్రకారంగానే ఉంటున్నాయి. Electircity ఉత్పత్తి పెరిగినపుడు వర్కర్లకు పని ఎక్కువ అవు

Sri K. Krishna Rao] [15th March 1954

తుంది. అసలు electricity department లో accounts department వుంది. ఈ accounts department యీ Electricity Department లోని Engineers యొక్క supervision క్రిందనే ఉంటున్నది. ఈ accounts section ఈ techinical staff క్రింద ఉండడంవల్ల వాళ్ళు చేసే expenditure ను accounts sectionవాళ్ళు సరిగా check చేయడానికి అవకాశంఉండకుండా పోతుంది. అసలు accounts మీద check అనేదే ఉండడంలేదు. ఆ Engineers ఏవో tenders పంపుతుంటారు. Contractors తో ఏదో విధంగా బేరంచేసి, వాళ్ళ యిష్టంవచ్చినట్లు settle చేసుకుంటారు. వీళ్ళ పైన సరైన check లేకపోవడంవల్ల accounts లో mischief జరుగుతోంది. Accounts వాళ్లు వీళ్ళక్రిందనే పనిచేయడంవల్ల సరిగా ఆ expenditure ను, ఆ accounts విషయాలన్నిటిని సరిగా check చేయడానికి scope లేకుండాపోతుంది. అందువల్ల ఈ Electricity Department లో చేసే expenditure మీదా, accounts మీదా సరైన check ఉండాలంటే Public Works Department లో ఉన్నట్లు Accountant General control క్రింద Accounts staff పనిచెయ్యవలసియుంటుంది. అలా Accounts branch కనుక ఈ accountant General క్రింద ఉండకుండాపోతే ఈ Techinical Engineers ఆ accounts ను check చేయడం, ఖర్చుచేసే వాళ్ళు, check చేసేవాళ్ళు వాళ్లే అవడంవల్ల correct గా accounts ఉండవు. ఈ విధంగా చేసినట్లయితే అక్కడ accounts లో ఏమైనా లోపంగాని, Technical Officers expenditure సరిగా లేకపోవడమనేదిగాని యెక్కడైనావుంటే అది కళ్ళకు కట్టినట్లు స్పష్టంగా తెలిసిపోతుంది. ఈ accounts department అప్పుడు Department కు కావలసిన stores కు, మిగతా other operational expenditure కు అంటే, oil కు, luedrication కు కావలసిన expenditure, అన్ని accounts ను కూడా ఈ accounts department వారి compleate check వుంటుంది. ఈ accounts department seperate గావుంటే, Electricity Departmentపై సరైన check ఉంటుంది. సరైన check ఉండడంవల్ల యిప్పుడు జరుగుతున్న mis applications అనేది ఈ Department లో ఉండుటకు

అవకాశం ఉండదు. ఈ accounts సరిగ్గా ఉండకపోవడం మూలానే యీ విధమైనటువంటివన్నీ జరుగుతున్నాయి.

(At this stage Sri G. Nagabhushanam occupied the chair)

ఈ విషయం accounts చూస్తే తెలుస్తుంది ఈ డిపార్టుమెంటు యిచ్చిన accounts చూస్తే, కొన్ని విషయాలు తెలుస్తున్నాయి. ఉదాహరణకు number of units of electricity generated లో, 10 మిలియన్లు హెచ్చినప్పుడు, దానికి fuel and lights కు అయిన అదనపుఖర్చు రు. 1.72 లక్షలు హెచ్చింది. కాని తర్వాత సంవత్సరాలలో number of units generated 14 మిలియన్లు హెచ్చితే, యీ పద్దుక్రింద 9 లక్షలు హెచ్చినట్లు కన్పిస్తూంది. 10 మిలియన్ల పెరుగుదలకు, రు. 1.72 లక్షలు ఖర్చు హెచ్చవుతే, 14 మిలియన్ల పెరుగుదలకు ఎంత హెచ్చవుతుందని అనుకున్నా, కనీసం రు. 3.44 లక్షలకు హెచ్చవవచ్చు. కాని అట్లుగాక 9 లక్షల రూపాయలు హెచ్చవుతూందంటే, యిది ఎందుకు కల్గిందో మనకు తెలియదు. ఇంతే కాదు. Other operational expenses లో కూడా, ఇదే విషయం కనిపిస్తూంది. 10 మిలియన్ల units of energy హెచ్చుగా ఉత్పత్తి చేస్తే, దానికయ్యే అదనపుఖర్చు యీ పద్దుక్రింద 1.46 లక్షల రూపాయలు ఖర్చు హెచ్చుతూందికాని, 2 మిలియన్లు అదనంగా generate చేసినప్పుడు, 4.27 లక్షల ఖర్చు యెట్లు హెచ్చుఅవుతూందో తెలియడం లేదు. అదేవిధంగా 14 మిలియన్లు అదనంగా generate చేస్తే, దానికి యీ పద్దుక్రింద 5.76 లక్షల రూపాయలు యెందుకు హెచ్చు ఖర్చవుతూందో మనకు తెలియడంలేదు. యీ విషయంగూర్చి పరిశీలించాల్సివుంది.

తరువాత consumers విషయంచెబుతాను. నెల్లూరుథర్మల్ స్టేషను వంటిచోట industrial consumer విషయంలో సర్‌చార్జి మామూలు చార్జికన్న ఎక్కువ అవుతోంది. మామూలు చార్జి యూనిటుకు 0-1-6 అయితే సరిచార్జి 0-2-6 ఎట్లా అవుతుందో నాకు అర్థంకావడంలేదు. Lubricating oil మీద run చేస్తున్నాం అంటే ఆ ఖర్చుల్లో ఏదో దుబారా వున్నది. దానిలో ఖచ్చితమైన check లేకపోతే విపరీతంగా డబ్బు హెచ్చవడం జరుగుతుంది. ఇది public money కాబట్టి, దీని

Sri K. Krishna Rao] [15th March 1954

గూర్చి check పరిశీలన హెచ్చుగావుండి waste ను తగ్గించుకోవాలి. High tension electricity, low tension electricity అనివున్నాయి. High tension electricity పెద్దపెద్ద factoriesకు ఇస్తారు; Low tension electricity చిన్న మరలకు ఇస్తారు. పిండిమరలకు, agricultural purposes కు ఇస్తారు. High tension electricity తీసుకునేవాళ్లు చాలా తక్కువమంది వుంటారు. విజయవాడలో సిమెంట్ ఫాక్టరీ, విశాఖపట్నంలో సిందియా కంపెని వీట్లకి ఎక్కువ కిలోవాట్ల energy కావాలి. వారు high tension electricity తీసుకుంటారు. చాలా విచిత్రమైన విషయం ఏమిటంటే high oension electricity చాలా తక్కువ ధరకు ఇస్తారు. సాధారణంగా tonsumers కు, మిగతావాళ్ళకు ఎక్కువధరకు ఇస్తారు. మా నెల్లూరులో 0-6-0, 0-6-6 కు సప్లయిచేస్తారు. High tension electricity unit 1-కి 0-0-6 కు సప్లయి చేసేచోట్లు వున్నాయి. సాధారణంగా వాడే consumers కు agriculture కు electricity intend అయినట్లు లేదు. High tension electricity కావలసినవాళ్ళకే యీ thermal stations నిర్మించి సృష్టించినట్లు కనిపిస్తుంది. చవక ధరలతో high tension power ఇస్తూ ఎక్కువ ధరలకు సాధారణ energy యిస్తున్నారంటే యీ రోజు high tension electricity చౌకధరలకు యిచ్చుట కేవలం small consumers దగ్గర హెచ్చు రేట్లు వసూలుచేయుటవల్లనే జరుగుతోంది. అందువల్ల ఖర్చు భరించేది small consumers, లాభాలు పొందేది large consumers. అమెరికా లాంటి పెట్టుబడిదార్ల రాజ్యాలలో high tension electricity విపరీతమైన చవకధరలకు ఇవ్వడం జరుగుతున్నదే. పెద్దపెద్ద industrialists కు మాత్రమే థర్మల్ స్టేషన్లు అక్కడ ఎక్కువగా ఉపయోగపడేది. ఇటువంటిదే మనరాష్ట్రములోకూడ కనిపిస్తుంది. మన ఆంధ్రదేశంలో 39285 లక్షల యూనిట్లు వస్తూంటే అందులో 2694 లక్షల యూనిట్లు మాత్రమే agriculture కు ఉపయోగపడుతోంది. మనదేశంలో agriculture అనేది biggest industry. 5 మాత్రమే agriculure కు ఇస్తున్నాము. ఎక్కువ percentage చూస్తే, విశాఖపట్నంలో 5 గురు consumers కు, బెజవాడలో 4 గురుకు, licencees తో కలిపి 10 మందికి ఇవ్వడం జరుగుతోంది.

కాకినాడలోకూడా అదేవిధంగా వున్నది. అలా ఇవ్వడం చాలా convenient కావచ్చు. ఒక single high tension line తో, హెచ్చు energy ఖర్చుచేయవచ్చు. కాని మనం హిందూదేశంలో వున్నాము. యిచ్చట కుగ్రామాలున్నాయి. ఒకవూరుకు మరోవూరుకు, దూరం వుంటుంది. యిటువంటిదేశంలో నే మనం electricity ని పుష్కలంగా సరఫరాచెయ్యాలి. ఒక wide met work of transimision lines to defferent villages వుండితీరాలి. మన engineers అమెరికాచదువు చదువుకున్నారు. కాని rural areas కు rural industries కు ఉపయోగపడేట్లు electricity system ను acclimatise చేసుకోవాలి. అమెరికా పద్ధతి వదలి, మన rural cunditions వీలుగా చేస్తేకాని లాభంలేదు.

ఇక connections యివ్వడంలో, యీ Electricity Department Officers సరిగా వర్తించడంలేదు. నెల్లూరు కు కోవూరు, యిందుకూరుపేట, మైపాడు, మొదలగు గ్రామాల నుండి రైతులు వస్తున్నారు. వారు నెల్లూరు thermal station నుండి తమ గ్రామాలకు power యివ్వమని వారిచుట్టూ తిరుగుతున్నారు. యీ Officer లు Dy· Collector మాదిరిగా ప్రవర్తిస్తూన్నారే కాని, elecrticity ని సరఫరా చేసేవారి మాదిరిగా ప్రవర్తించడంలేదు. మనం ఏదైనా అంగడికి వెడితే, యీ వస్తూవు తీసుకొనండి. ఆ వస్తువు తీసికోండి అని అంటారు. కాని వీరి ప్రవర్తన మూలంగా, R. D. O. office ల మాదిరిగా, యీ electricity office లను మార్చి వేస్తున్నారు ఆంధ్రదేశానికి hydro-electric schemes రావడం చాలా కష్టం అన్నారు మంత్రిగారు. 1946-47 లో వెంకటగిరివద్దవున్న కాళింగనదినుంచి ఆ వైపున శ్రీకాకుళంలో, నాగావళినది మధ్యవున్న 20 నదీ basins లోను explore చేయమన్నారు. రెండు sub-divisions పెట్టారు. మనకు hydro electric possibilities వున్నాయని నా నమ్మకం. ఎన్నో కోట్లుఖర్చుపెట్టి తుంగభద్రకు dam కట్టారు. Hydro electricity generate చెయ్యవచ్చు. మనకు నయగరావంటి water falls రమ్మంటే

Sri K. Krishna Rao] [15th March 1954

ఎక్కడనుంచి వస్తాయి. కాని అలా hydro-electrical investigations కు నిర్మించబడిన sub-divisions తర్వాత యెత్తివేస్తారు. ఆ investigations pursure చేయుట నిల్పివేశారు. నేను మద్రాసు రాష్ట్రంలో మంత్రిగావున్న రంగారెడ్డిగారిని అడిగితే, యీ చిన్న basins గూర్చి 20 సంవత్సరాలు survey చేయాలి అన్నారు. అంటే 1977 వరకు rainfall చూసి, చెయ్యాలని ఆయన జవాబుచెప్పారు. ఇదేపద్ధతిని Pykara, Metur గూర్చి అవలంబించారా? పైకరా, మెట్టూరు దగ్గర 20 సంవత్సరాల rainfall చూచి survey ఆవిధంగా చేశారా? ఇది ఈ దేశంకాబట్టి యీ సంవత్సరాల investigation అవసరంవచ్చింది. మనకు dual purpose frojects కావాలి. కాని, యీ sub-divisions అన్నీ 1947-49 లో యెత్తిపారేశారు. ఒకజాతియొక్క నాగరికత, అభ్యుదయంఆజాతియొక్క per capita consumption of electricity మీద ఆధారపడివుంటుంది. మన దేశంలో electricity development చేయకుండా, తగినటువంటి possibilities explore చేయకుండా వుండడం చాలా పొరపాటు. ఇక Electricity Department లో జరిగేపనుల విషయంలో ఒక Deputy Collector office లో మాదిరిగా red tapism వ్యాపించియున్నది. నీ గ్రామాలకు electricity యిస్తే, యీ industries పెట్టుకో వచ్చునని canvass చేయాలి అధికారులు. అందుచేత all round knowledge ఉన్నవాళ్ళు electricity department లో వుండాలి. వారు గ్రామస్థులకు వారు యిప్పుడుచేసేపనులు electricity ద్వారా ఏవిధంగా చేయవచ్చునో, యెట్టి possibilities వున్నాయో చెప్పాలి. ఇక hydro-electric schemes యిప్పుడు జరుగుతూవుండే విషయం పరిశీలిద్దాము. మాచ్‌ఖండు విషయం చాలా జాగు జరుగుతోంది. 1953 March లోనే transmission lines complete అవుతాయి అని Chief Engineer 1951-52 report లో చెప్పారు. March 1954 వచ్చింది. ఇంతవరకు transmission lines పూర్తిఅయినట్లు లేదు. ఎందుకు ఆలస్యం చేయాలి అని అడుగుతున్నాను. ఈ వేళ సంజీవరెడ్డిగారు copper wires రాలేదు, transmissions పూర్తి చేయడానికి వీలు లేకపోతోంది అన్నారు. మీరు సోవియటు యూని

యనుతో ఎందుకు వ్యాపారం చేయరు. అక్కడనుండి copper wires తెప్పించడానికి ఏమిప్రయత్నం చేశారు ? అని అడుగుతున్నాను. అలా చేస్తే చాలా చవకధరలకు మీాకు త్వరగావస్తాయి. Soviet Union electricity విషయంలో చాలా అభివృద్ధిపొందిన దేశం. ఇంగ్లండు, అమెరికాదేశాలలో ధరలనుఎక్కువగా ఉంచాలనే ఉద్దేశ్యంతో వారు యంత్రపరికరాలను సకాలంలో పంపక, మన అవసరాన్ని అవకాశంగా తీసుకొని హెచ్చులాభాలు పొందడానికి ప్రయత్నిస్తారు. అందుచేత copper wires దొరకలేదనడం ప్రయోజనంలేదు. ఇతర ప్రియత్నాలుచేసి electrification తొందరగా ప్రారంభించాలి. విశ్వనాథంగారు 4 కోట్లు ఖర్చు చేస్తామంటున్నారు. Electrification విషయంలో ఆంధ్రదేశానికి discrimination జరిగిందని మనం చెబుతాం. దాదాపు 300 సంవత్సరాలనుండి యీా విషయంలో మనం వెనుకబడివున్నాం. కొన్ని దేశాలు ఈరోజు atomic energy విషయంలో ప్రయత్నిస్తున్నప్పుడు, మనం విద్యుచ్ఛక్తి విషయంలో కూడా వెనుకబడి యుండడమా అనేదే మనం ఆలోచించాలి. కాని మనకు యింతకు ముందే అనుభవంవుంది. Budget estimate లో హెచ్చు మొత్తాలు provide చెయ్యడం, కాని Revised estimates లో యిటువంటి వాటికి allotments తగ్గించడం, తీరా accounts వచ్చేటప్పటికి, యీా మొత్తాలు చాలా తగ్గడం జరిగింది. అంటే, 4 కోట్ల రూపాయల estimates 20 వేల రూపాయలకు తగ్గిపోవడం జరిగింది. ఇటువంటివి యీా department విషయంలో జరుగకూడదని, electricity system ను develop చెయ్యాలని కోరుతూ, యీా క్రొత్త తీర్మానాన్ని బలపరుస్తున్నాను.

The House adjourned for lunch.

After lunch 3-0 p. m.

Sri P. RANGA REDDI:—అధ్యక్షా, మంత్రిగారు ఈ విద్యుచ్ఛక్తిడిమాండును ప్రతిపాదిస్తూ ఇపుడుజరుగుతూఉన్నటువంటి ప్రణాళికల విషయమై, వాటి పద్ధతుల గురించి సంపూర్ణంగా వివరించేరు. ఆంధ్ర దేశములో విద్యుచ్ఛక్తి మూలమూల ప్రాంతాలకు కూడా సరఫరా చేయడానికి ఉద్దేశం ఉన్నట్లు వెల్లడిచేసేరు.

Sri P. Ranga Reddi ] [ 15th March 1954

దీనితో ఆంధ్రదేశం అభివృద్ధికి చాలావరకు అవకాశాలు ఉంటాయి అని చెప్పేరు. అందుచేత ఈ రోజున ఈ డిమాండులో కోరినమొత్తాన్ని ఇచ్చేదానికి ఈ సభవారికి ఎట్టి ఆక్షేపణ ఉండదని భావించుతాను. అంతేకాదు. ఈ డిపార్టుమెంటు తలపెట్టిన ప్రణాళికలన్నీ పూర్తిచేసేదానికి ఇప్పుడు కోరుతున్న మొత్తాన్నే కాదు; ప్రజల ఆర్థిక సౌభాగ్యం వృద్ధిపొందినపుడు మరింత మొత్తాన్ని ఇవ్వడానికి కూడా ఎవరికీ అభ్యంతరము ఉండదు. అన్ని పార్టీలవారుకూడా విద్యుచ్ఛక్తి ఆంధ్రలో అన్ని ప్రాంతాలకు సరఫరా కావాలని కోరుతున్నారు. గాని నేటిప్రణాళికలుచూస్తే విద్యుచ్ఛక్తి అన్ని ప్రాంతాలకూ అందుతుందని నాకు కనబడలేదు. ఈ రోజున మీరు ఎక్కువగా ధనాన్ని ఇవ్వగలిగితే ఆంధ్రదేశమంతటా విద్యుశ్ఛక్తి సరఫరా చేయడానికి మేము సిద్ధముగా ఉన్నామని మంత్రిగారు చెప్పవచ్చు. అయితే ఈరోజున విద్యుచ్ఛక్తి అవసరమున్న ప్రాంతాలకు సరఫరా చెయ్యాలని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ రోజున తుంగభద్రా ఎలక్ట్రిక్ సిస్టమునుండి వచ్చే పవరుగాని, మాచ్ ఖండునుండి వచ్చే పవరుగాని ఇకముందు తలపెట్టే థెర్మలు, స్టీము సిస్టములనుంచి వచ్చేపవరుగాని మెట్టప్రాంతాలకు అందచెయ్యడానికి ఏర్పాటు చేసినట్లు నాకు కన్పించడంలేదు. తుంగభద్ర పవరు నంద్యాలనుండి తాడిపత్రి వరకున్నా, మాచ్ ఖండుపవరు ఒంగోలు వచ్చి రేణిగుంటవరకు పోతుంది. మధ్యప్రాంతమైన కంభం, మార్కాపురం, బద్వేలు తాలూకాలు అధికముగా వెనుకపడివున్న మెట్టప్రాంతాలు. వాటికి విద్యుశ్ఛక్తి సరఫరా చేయకపోవడం చాలా విచారకరము. మాది కేవలము బావులమీద ఆధారపడే ప్రాంతమని చెపుతున్నాను. పెద్ద ప్రాజక్టుల ప్రయోజనం కంభం, మార్కాపురం తాలూకాలకు లేదు. కాబట్టి ఎలక్ట్రికు పవరు సప్లయిచేసే ఏర్పాట్లు చెయ్యవలసిందని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. అంతేకాదు, కంభం తాలూకాలో పండ్లు పండించే ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి అధికముగా ఉపయోగపడవచ్చును అని వ్యవసాయశాఖవారు నిర్ణయించేసారు. అక్కడ ఇక్స్పెరిమెంటులు స్టేషను పెట్టి పండ్లమొక్కలను పెంచి ఆంధ్రదేశానికంతకు సప్లయిచేసేదానికి ఒక కేంద్రాన్ని స్థాపించడానికి నిశ్చయించడమైనది. కాబట్టి ఈ విధముగా అవసరంఉన్న ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరిఫరా చెయ్యడానికి ఒక

థెర్మలు స్టేషను స్టార్టు చెయ్యడానికి మంత్రిగారు కృషిచెయ్యవలెనని నేను కోరుచున్నాను. అట్లాగనే మార్కాపురం ప్రాంతం ఉంది. అక్కడ పలకల పరిశ్రమ చాలా పేరుపొందినది. విదేశాలకుకూడా ఎగుమతులు జరుగుచున్నవి. అది గృహపరిశ్రమగానే ఈ నాటికి వృద్ధిపొందు తున్నది. ఈ పరిశ్రమ విషయమై ఇండియను టారిఫ్‌బోర్డువారు ప్రభుత్వంవారు ఈ పరిశ్రమకు రక్షన ఏవిధముగా ఇవ్వాలో ఆలోచించ వలెనని చెప్పిఉన్నారు. వారి రిపోర్టులో ఒక వాక్యం చదువుతాను.

"The Madras Government should give both financial and other assistance for establishing and operating electricity generating plant at Markapur"

అందుచేత యీ అవసరాన్నికూడా దృష్టిలో పెట్టుకొని కంభం మార్కాపురం, గిద్దలూరు ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా కావడానికి అక్కడ ఒక thermal station పెట్టాలని ఆశిస్తున్నాను. ప్రతిపక్షు నాయకులు పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, పుల్లారెడ్డిగార్లు మా పార్టీ ఆరోపణ చేసినట్లు మీ పార్టీ సభ్యులు ఆరోపణచేస్తున్నారనవచ్చు. సంజీవరెడ్డి గారిని నా యీ కోర్కె తప్పనిసరిగా నెరవేర్చాలని ప్రార్థిస్తు న్నాను.

Sri T. POTHA RAJU:- అధ్యక్షా, ఉమ్మడి రాష్ట్రములో ఆంధ్రప్రజలకు ఎంత నష్టము కల్గింది యీామొక్క విద్యుచ్ఛక్తివల్ల అర్థ మౌతుంది. Administrative report లోని కొన్ని అంకెలు ఈ విషయాన్ని స్పష్టము చేస్తున్నవి. ఆంధ్రలో తలకొక్కింటికి 2.7 units ఖర్చుపెట్టుతున్నారు, 24units వాండ్లు మద్రాసు రాష్ట్రంలో ఖర్చుపెట్టు కుంటున్నారు. ఆంధ్రలో 83 pump sets వున్నవి. వాండ్లకు 14760 వున్నవి. ఆంధ్రలో 197గ్రామాలకు electricity సరఫరా అవుతుంది. మద్రాసులో 12800 గ్రామాలకు electricity వుంది. ముఖ్యంగా యీ electr city వ్యాప్తిమీద మన రాష్ట్రభవిష్యత్తు ఆధారపడి వుంటుంది. మనము ఇప్పుడు తీసుకున్న schemes బాగా అమలు పర్చాలంటే అం దులో పనిచేసేవాండ్ల పరిస్థితికూడ గమనించాలి. వాండ్లు ఉత్సాహంగా పనిచేస్తే తప్ప త్వరగా మనము స్కీములను సకాలంలో పూర్తి

15th March 1954] [Sri T. Potha Raju

చేయలేము. మన ప్రభుత్వానికి, ఆలాగే ఒరిస్సా ప్రభుత్వానికి, మాచ్ ఖండ్, రాయలసీమ power system కార్మికులు అనేక దఫాలు యిబ్బందులు తెలియజేశారు. యీ ఇబ్బందుల విషయములో సరియైన చర్య తీసుకోవడములేదు. యీ power systemలోని పని వాండ్లను మూడు category లుగా విభజించడము జరిగింది. Nominal muster rolls వాండ్లకు ఎప్పుడుంటామో, ఎప్పుడు పోతామోఅనేభయముంది. పని garentee లేనిభయముంది. C. C. S. క్రింద O. S. S. క్రింద పని guarantee వుండాలి. మొత్తము మూడు వేల మందిలో 350 మందినే permanent staff క్రింద తీసుకున్నట్లు కనిపిస్తుంది మిగిలిన రెండు వేల చిల్లరమందికి యీ రోజున పనిలో వుంటామా లేదా అనే భయముంది. యీ N. M. R. పద్ధతిని రద్దుచేసి, 6-7సంవత్సరములు experience వున్న వాండ్లను permanentచేయాలి. 2 నుంచి 7 సంవత్సరముల service వాండ్లను వెంటనే O. S. S. లోనికి తీసికొని permanent చేయాలి. N. M. R. వాండ్లను C. S. S క్రింద చేర్చాలి. ఆలాగైతే workers enthusiasm తో పనిచేస్తారు మన కేంద్రప్రభుత్వము temporary workers కు provident fund facilities కలుగచేసింది కాని వీరిలో కొంతమంది permanent వాండ్లకుకూడ యీ provident fund అమలు జరగడములేదు. ఈ provident fund అవకాశము workers అందరికి కలుగజేసినట్లయితే ఒక guarantee అనేది వుంటుంది. ఆ పద్ధతి తప్పకుండ అమలు పర్చాలి. అసలు seniority list maintain చేయడము అనేదిలేదు. వాండ్ల seniority list maintain చేయాలి. పోతే యిక యీ workers తరఫున పనిచేయడానికి ఒక union ఏర్పడాలి. మామూలు private company లు trade unions ను గుర్తించడము జరుగుతోంది. కాని ప్రభుత్వము మాత్రము Andhra Provincial Electrial Workers Unionను గుర్తించడము జరుగలేదు ప్రభుత్వము ఉద్యోగులద్వారాకాక, పనిచేసే workers side నుంచి కూడా వారి ఇబ్బందులేవో తెలుసుకోవాలి. మన ప్రభుత్వము దురదృష్టవశాత్తు ప్రజల, కార్మికుల సహకారము తీసుకోవడము లేదు. ఆలా తీసుకొన్నట్లయితే ఉత్సాహముగా పనిచేసేటట్లు చేయగలరని మనవిచేస్తున్నాను.

మాచ్ ఖండులో 7 గురు పనివాండ్లు చనిపోయారు. అక్కడ 15 మందిలో 7 గురు పనివాండ్లు చనిపోయారు, 8 మందికి దెబ్బలుతగిలాయి. ఆ pit పైన హెచ్చు బరువు వేయడము చేతను, పట్టాలుసరిగా పెట్టక పోవడమువల్లను, అధికారుల అజాగ్రతవల్లను ఈప్రమాదంజరిగింది. ఇంత వరకు వాండ్లకు compensation యివ్వలేదు. క్రిష్టా ఆనకట్ట repairs చేయునప్పుడు చనిపోయి వారి కుటుంబాలకు compensation యిచ్చారు. అదికాక కుటుంబానికి 10 యెకరాలభూమి యిస్తామన్నారు కాని ఆ భూమి యింతవరకు యివ్వలేదు. ప్రభుత్వము వెంటనే ఆ భూమిని చచ్చిపోయినవారి కుటుంబాలకు యివ్వాలి. మన అందరికోసము చచ్చిపోయినవారి కుటుంబాలకు తగినcompensation, భూమి వసతి కల్పించాలి. ఇప్పుడు దీనిలో చాల దుబారావుందని నా ఉద్దేశ్యము, ఉదాహరణకు బెజవాడలోనే ప్రాంతీయ officer దాదాపు 10 వేలు........

* Sri P. PUNDARIKAKSHACHARYULU :— అధ్యక్షా, నేను యీ cut motion లో electricity extension గురించి చెప్పాను. దానిని చీపురుపల్లి నుండి శ్రీకాకుళమునకు తీసుకు పోయినప్పుడు రాజామ్మీదుగా పోయేటట్లు వేయాలన్నాను. ప్రభుత్వ దృష్టికి 4-5 సంవత్సరముల క్రిందటనే తీసుకరాబడ్డది. అప్పుడు తప్ప కుండా electricity extension scheme ను రాజామ్ మీదుగా చీపురుపల్లినుండి శ్రీకాకుళమునకు తీసుకపోతామన్నారు.

కాని మన దురదృష్టవశాత్తు order ఏమీ వేయకుండా, యిది మాచ్ఖండ్ పూర్తి అయిన తరువాత చీపురుపల్లినుండి శ్రీకాకుళంకు line తీసుకొనిపోతున్నప్పుడు, తప్పకుండా రాజాంనుండి పొందూరు మీదుగా తీసుకొనిపోతామని చెప్పారు. కాని క్రిందటి సంవత్సరం మద్రాసు ప్రభుత్వంలో ఒక ప్రశ్న వేశినప్పుడు P. W. D. మంత్రి రంగా రెడ్డిగారు, చీపురుపల్లి నుండి శ్రీకాకుళం line తీసుకొని పోతున్నప్పుడు పొందూరు, రాజాం విషయం ఆలోచిస్తామని చెప్పారు. చీపురుపల్లి నుండి శ్రీకాకుళం తీసుకొని వెళ్ళుతున్నప్పుడు మధ్యను రాజాం, పొందూరు మేజరు పంచాయతీబోర్డు area లు వున్నవి. ఈ line తిన్నగా వేస్తే 30 మైళ్లు అవుతుంది: దానిని రాజాం, పొందూరు మీదుగా

Sri P. Pundarikakshacharyulu] [15th March 1945

తీసుకొని వెళ్ళితే 35 మైళ్ళు అవుతుంది. మధ్యను 5 మైళ్లు మాత్రమే తేడావున్నది. కాబట్టి నేను ముఖ్యమంత్రిని కోరేది ఏమంటే, యిప్పుడు చీపురుపల్లినుండి శ్రీకాకుళం తీసుకొని వెళ్ళుతున్న line ను via రాజాం, పొందూరు మీదుగా వేయవలెనని కోరుతున్నాను. రాజాం పంచాయతీ బోర్డువారు మంత్రిగారికి సమర్పించిన వినతిపత్రములో, యీ విషయం చెప్పబడింది. మంత్రిగారు శ్రద్ధవహించాలని కోరుతున్నాను. రాజాం నుండి, వీరఘట్టాంకు రెండు major panchayat area లు వున్నవి. శ్రీకాకుళం line ను, రాజాంనుండి తీసుకొనివెళ్ళటం చాలా సులభము. రాజాంనుండి పాలకొండ, వీరఘట్టంలకుగూడా ఈ line ను తీసుకొని వెళ్లాలని నేను మనవిచేయుచున్నాను.

శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలలో సుమారు 10 సంవత్సరముల క్రిందట ఎలక్ట్రిసిటి extensions కొంతవరకు తీసుకున్నారు. అవి అంతవరకే ఆగిపోయినవిగాని, తరువాత extensions జరుగలేదు. ఇవి చాలా వెనుకబడియున్న ప్రాంతాలని, మంత్రిగారికి తెలుసును. ఇప్పుడు ఆంధ్ర రాష్ట్రము ఏర్పడింది. నరసన్నపేటకు line తీసుకొని వస్తూ, అక్కడక్కడనే ఆపివేశారు. ప్రస్తుతం మా జిల్లాలో– చాలా చోట్ల యీ line extension schemes వున్నాయి. వీటిని గురించి ప్రజలు చాలా తొందరచేస్తున్నారు. ఈ విషయములో పంచాయతీ బోర్డులవారు సహాయం చేయటానికి సిద్ధముగానున్నారు. వీరు పన్నులు గూడా, ప్రజలమీద యిందుకుగానువేసి, డబ్బును సిద్ధముగా వుంచారు. కాబట్టి, యీ extensions మేజరు పంచాయతీ బోర్డుల ప్రాంతాలకు యిప్పించవలెనని మనవిచేస్తూ, తప్పకుండా వీట్ల విషయంలో వెంటనే తగుచర్య తీసుకుంటారని ఆశిస్తున్నాను.

* Sri VAVILALA GOPALAKRISHNAIAH :— ఆంధ్రదేశం, విద్యుచ్ఛక్తి విషయములో ఎంత వెనుకబడివున్నదో వివరములు చెబుతున్నాను.

| | | |
|---|---|---|
| కెనడాలో | 410 | యూనిట్లు వాడుతున్నారు. |
| అమెరికాలో | 510 | ,, డిటో |

| | | |
|---|---|---|
| ఇంగ్లండులో | 1110 | యూనిట్లు వాడుతున్నారు. |
| జపానులో | 540 | డిటో |
| నార్వేలో | 508 | డిటో |
| ఇండియాలో | 14 | డిటో |
| ఆంధ్రలో | 4 | యూనిట్సు మాత్రమే వాడుతున్నారు. |

దీనినిబట్టి విద్యుచ్ఛక్తి మనం చాలా తక్కువగా వాడుచున్నట్లు తెలుస్తున్నది. నార్వేలో వుండే పరిస్థితులు, మన దేశపు పరిస్థితులు యించుమించు ఒకేవిధంగా వుంటున్నవి. నీటివసతుల వల్ల వున్న ఆవకాశాలను సద్వినియోగము చేసుకున్నారు. మాచ్‌ఖండ్ area క్రింద చాలాపని జరిగింది. వాటితోపాటు చిన్నచిన్న మైనరు area లు వున్నవి. వాటిని గూడ అభివృద్ధిలోనికి తేవాలి. పలనాడు తాలూకాలో ఎత్తిపోతల అనేచోట మైనర్ పవర్ స్కీము తీసుకొని రావలసివున్న విషయం, ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంగారికి తెలుసును. ఇటువంటి చిన్న చిన్న స్కీములను అమలులోనికి తీసుకొనివస్తే చాలా వుపయోగముగా వుంటవి. ఇలాంటివి తీసుకొనిరావాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. మనదేశంలో 1570 గ్రామాలువున్నవి. వీనిలో 251 గ్రామాలకే, విద్యుచ్ఛక్తి వుపయోగపడుతున్నది. దీనినిబట్టి లెక్కవేసే 2 శాతం జనం విద్యుచ్ఛక్తి వాడుకుంటున్నారు. కాబట్టి, ఇది ఎక్కువ కావలసిన అవుసరం వున్నది. ఈ electricity department తాలూకు షుమారు 1500 మంది ఉద్యోగస్తులను, శ్రీ రాజగోపాలాచారి ప్రభుత్వములో తీసివేయటము జరిగింది ఇది మనఅందరికి తెలుసును. రిట్రెంచ్‌మెంటువల్ల జరిగిందన్నారు. ఇప్పుడు వీరివిషయమై తగుచర్య తీసుకొనుటకు వీలు లేకపోతే, రేపువచ్చే works లోనైనా, యీ ఉద్యోగస్తులకు ప్రాధాన్యం యివ్వాలని కోరుచున్నాను. ఫిరంగిపురం area కు electricity స్థాపించారు. దానినుండి, గ్రామాలకు గూడ విద్యుచ్ఛక్తి ఉపయోగపడేలాగు ఏర్పాటుచేయాలని కోరుతున్నాను. తుంగభద్ర ప్రాజెక్టు విషయములో మన ఉద్యోగస్తులకు చాలా అన్యాయం జరిగింది. అరవవుద్యోగస్తులకు ఏమీ యిబ్బందులు రాలేదు. వీరు అప్పుడు రాజీనామా యిచ్చియుండలేదు. కాబట్టి

Sri Vavilala Gopalakrishnaiah] [15th March 1954

అన్యాయం జరిగిన ఆ ఉద్యోగులకు, ఆంధ్ర State లో ఉద్యోగ అవకాశాలు కల్పించి, వారి కష్టాలను తొలగించవలసినదిగా కోరుతున్నాను. వ్యక్తిగతమైన విషయం చెప్పకతప్పదు. ఇవాళే సత్తెనపల్లిలో electricity దీపాలు వెలిగించియుంటారు. ఐతే, నేను చెప్పేది ఏమంటె, యీ విద్యుచ్ఛక్తి గ్రామాలలోని వ్యవసాయమునకు గూడ ఉపయోగపడులాగున చేయాలంటే చాలా కృషిచేయవలసి వస్తుంది. కాబట్టి యావత్ ఆంధ్రలో యీ విద్యుచ్ఛక్తి చాలా ఉజ్వలముగా వెలిగింపబడే లాగున, తగుప్రణాళికలు తీసుకొనిరావలెనని, నేను కోరుతున్నాను.

* Sri K. VARADACHARI :— అధ్యక్షా, ఈవిషయాన్ని మాట్లాడేటప్పుడు party భేదాలు యేమీవుండవు. ఇతరపార్టీలవారు యింతవరకు మాట్లాడినవి మేమంతా ఒప్పుకోవలసిన విషయాలే. ముఖ్యంగా కృష్ణారావుగారు చెప్పినపంథా అవలంబించవలసినదే. వారు చెప్పిందాంట్లో కాన్వాస్ చేయటం చాలా మంచిదేఅవుతుందని చెప్పుతున్నాను. 4 యూనిట్లకు ఉపయోగపడుటకు కాన్వాస్ ఏమిచేస్తాము? ఇంతవరకు చేస్తున్నదానినే చేయవలసినదిగా వున్నది

మన ఉపముఖ్య మంత్రిగారు చేసిన ఉపన్యాసములో, చిత్తూరు జిల్లాలో ఏప్రాజెక్టు అవ్వయింపదన్నారు. దానికి సదుపాయాలు లేవని చెప్పారు. అది వుండేదేఅంత. Electricity ప్రాజెక్టు అనేసరికి చిత్తూరు జిల్లాకు "దానివాత మన్నే" అని చెప్పవలసినదిగా వున్నది. High power మెట్టూరు సప్లయివల్ల చిత్తూరు జిల్లాకు అక్కడక్కడ కొంచెము, కొంచెము మెట్టుచున్నది.

ఇప్పుడు రాష్ట్రవిభజన కావడముతో, మద్రాసు రాష్ట్రము వారితో యింతవరకు యిచ్చుచున్న పవర్ సప్లయిని, యిట్లాగే continue చేయటము గురించి, జాస్తిగా పొందే విషయము గురించి ఏమి ఏర్పాటు చేసుకున్నదీ సూచింపబడ లేదు. తగిన ఏర్పాట్లు చేసుకోవటం మంచిది. ఇంతవరకు సప్లయిఅవుతున్న చిన్న ప్రాంతాలకే గాక, National rural welfare area లకు యీ electricity సప్లయి వచ్చేటట్లుగాచేస్తే, పెద్ద ఘనకార్యము చేసినట్లుగా తోస్తుంది. ఆవిధంగా చేయటానికి విశేషమైన అవకాశా

లున్నాయి. ఈమధ్యను కోయంబత్తూరునుంచి ఒక expert వచ్చి, original గా డెవలప్ కాని areas ను తనిఖీచేసి, యీ ప్రదేశాలలో విద్యుచ్ఛక్తి సప్లయిలకు, విశేష అవకాశాలున్నట్లు ఒక నివేదికను సమర్పించారు. ఆరోగ్యవరం, రేణిగుంటలకు line వేస్తామని చెప్పారు. ఆ line నగరివరకు వచ్చింది. తరువాత war వచ్చింది. ఆ పని అట్లాగే నిలిచి పోయింది.

ఈ కాలంలో ఇర్రిగేషన్ సదుపాయాలు లేనందువల్ల ఈ ప్రదేశాలు క్షామంవల్ల ప్రజలు చాలా కష్టపడినారు. అటువంటి సందర్భంలో, ఇప్పటికైనా, విద్యుచ్ఛక్తి contract మీద మనకు తెప్పించుకొని ఆ area లో మొత్తంగా దీని ఏర్పాట్లు చేసినట్లయితే చాలా ఉపయోగకరంగా ఉంటుంది. కనుక ఇక మీదనైనా మంత్రి గారు ఈ విషయంలో జాస్తి శ్రద్ధవహించి, అక్కడ ప్రజలు భావులక్రింద సేద్యము చేసుకొనడానికి అనుకూలముగా ఈ power ను సప్లయి చేస్తారని ఆశిస్తున్నాను, ఇప్పుడు మదనపల్లి thermal station పెట్టారు. దానికి ఒకతట్టు వాయల్పాడు, ఇంకొకతట్టు పుంగనూరు ఉన్నాయి. ఈ station నుంచి ఈ ప్రాంతాలకు దేని కెంతభాగం power ను వినియోగించడానికి సాధ్యమవుతుందో యోచనలు చేయవలసి యుంటుంది. ఈ thermal station కేవలం మదనపల్లి town కే పరిమితం కాకుండా, పరిసర ప్రాంతాల ప్రజలు ఉపయోగించేటట్లుగా ఏర్పాట్లు చేయవలసిందని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

Sri C. SUBBARAYUDU:— అధ్యక్షా, ఈ electricity extentions గురించి మాట్లాడవలసి వచ్చినప్పుడు, ఈమధ్యన కొన్ని సంవత్సరములనుంచి తాడిపత్రి, అనంతపురం, మదనపల్లిలో thermal stations చాలా నష్టంతో పనిచేస్తున్నాయని చెప్పవలసి యున్నది. దీనికి కారణమేమిటంటే, ఆ towns లో, industrial loads కు ఎక్కువ అవకాశం లేదు. తాడిపత్రిలో industrial load చాలా తక్కువ. 5 మైళ్లు దాటితేగాని, వ్యవసాయం కొరకు ఉపయోగించుకొనుటకు అవకాశాలులేవు. ఈ విషయం సంజీవరెడ్డిగారికి తెలుసును. దానికి పరిసర ప్రాంతాలలో, ముచ్చుకోట

Sri C. Subbarayudu] [15th March 1954

మొదలగు 30, 40 గ్రామాలలో 15, 20 భావులు వరకు ఉన్నాయి. 5, 6 మైళ్ళు దాటితేగాని రైతులకు ఇది ఉపయోగపడడానికి వీలులేదు, దీనికి తూర్పుదిశపోతే, కొట్టూరు, బట్టాయిపల్లి గ్రామాలు ఒక belt area ఉన్నది. అక్కడికి extend చేయవలసివస్తే కొన్ని లక్షలు కావలసి వస్తుంది. తరువాత కడపనుంచి దిగువకు extend చేయడానికి invistigation జరిగింది. 8 percent ruturn వస్తుందని అంచనా వేశారు అయితే, ఇదివరకు 4, 5 సంవత్సరములుగా, extention జరగలేదు. ముఖ్యంగా ఈ తాడిపత్రి thermal station చాలా నష్టంగా పనిచేస్తున్నది, ఈ విధంగా పెట్టడంవల్ల ప్రభుత్వానికి నష్టము వచ్చేదే కాకుండా ప్రజలకుగూడ ఉపయోగంలేదు. ఇది నిజంగా వ్యవసాయానికి ఉపయోగపడేటట్లు చేయాలంటే, delt area కే ఈ power ఎక్కువ సప్లయి చేయవలసి యుంటుంది. అప్పుడే రైతులు దీనివల్ల లాభము పొందగలరు. బాగుగా పంటలు పండి అధికాహారోత్పత్తి కాగలదు.

రెండవది, ప్రతిగ్రామానికి electricity సప్లయి చేయాలంటే, 50 సంవత్సరాలు పడుతుంది. ఇప్పుడు రాయలసీమలో lift irrigation కు ఎక్కువ అవకాశాలున్నాయి. కనుక ప్రాజెక్టులు investigate చేసేటప్పుడు ఈ lift irrigation కు possibilities ఎక్కడెక్కడైతే ఉన్నవో, దానిని దృష్టిలో పెట్టుకుని ఆ విధంగా కాలువలను, ఏర్పాటుచేసినట్లయితే చాలా ఉపయోగకరంగాయుంటుంది. ఉదాహరణకు పెన్న అహోబళందగ్గర ఆ విధంగాచేయడానికి అవకాశాలున్నాయి. ఆ విధంగా ఉరవకొండ పరిసర ప్రాంతాలలో 30, 40 వేల ఎకరాలు భూమి బాగుచేయడానికి వీలుఅవుతుంది. ఆంధ్రదేశంలో కావలసినంత నీరు ఉన్నది. ఆ నీరు సక్రమంగా ఉపయోగ పడేటట్లు చూడవలసియున్నది కనుక ఈ, విద్యుచ్ఛక్తి extension ఇచ్చేటప్పుడు industrial load, project motive అనేటటువంటి ఉద్దేశాన్ని ఇకపైన మాని ఇది నిజంగా రైతులకు ఉపయోగపడేటట్లు, belt areaలో ఏర్పాటు చేయవలసియుంటుంది. ముఖ్యంగా project ప్రాంతాలు, delt areas, భావులమీద ఆధారపడే ప్రాంతాలు, తరువాత minor irrigation మీద ఆధారపడిన ప్రాంతాలు ఉన్నాయి. ఈ

విధంగా, ఆయా ప్రాంతాలయొక్క అవసరాలను గమనించి, మనకు ఉండేటటువంటి ఆర్థిక స్తోమతనుబట్టి, అవసరాలనుబట్టి, అటువంటి ప్రాంతాలకు electricity extension ఇచ్చినట్లయితే ప్రజలకు చాలా ఉపయోగకరంగా ఉంటుంది. పంటలుబాగా పండడానికి వీలుంటుంది. కనుక మంత్రిగారు తాడిపత్రి విషయంలో కాస్త శ్రద్ధతీసుకొని ఆ ప్రాంతానికి electricity extension కలుగజేస్తారని మనవిచేస్తున్నాను.

Sri K. V. RAMESAM:—అధ్యక్షా, మా విశాఖపట్టణం జిల్లాలోని విశాఖపట్టణం thermal station గురించి కొంత మనవిచేయ దలచాను. ఈ thermal station నుంచి అనకాపల్లి sugar factory మీదుగా చోడవరంవరకు మాత్రం extension ఇవ్వబడింది. కాని, చోడవరంనుంచి ఇంకొక 11 మైళ్ళ దూరము, మాడుగల వరకు extension ఇచ్చినట్లయితే, చాలా ఉపయోగకరంగా ఉంటుంది. ఈ ప్రాంతములో sugar cane చాలా విరివిగా పండుటకు అవకాశ మున్నది. అందుకు అది చాలా అనుకూలమైనటువంటి ప్రదేశము. ఆ చోడవరం line కు ఇరుప్రక్కల, 1, 2 ఫర్లాంగులలో, కొన్ని చోట్ల నూరుగజాలలోనే చెరకుపండే గ్రామాలున్నాయి. ప్రస్తుతము చోడవరం ఒక గ్రామానికే ఈ power supply సౌకర్యము కలుగజేయబడినది. ఇతర గ్రామాలకు ఏ విధమైనటువంటి సౌకర్యం కలిగించలేదు. మాడుగుల ప్రాంతంలో mica mines ఉన్నవి. ఇతర industrial load కూడా ఉన్నది. చాలా జనసమర్థమైన గ్రామాలున్నవి. మొత్తంమీద విశాఖపట్నం జిల్లాలో చెరుకుపంట విశేషంగా పండుతుందని ప్రభుత్వమునకు తెలుసును. మాకు ప్రాజెక్టులేమీ లేవు. చాలవరకు well irrigation మీదనే ఆధారపడడము జరుగుచున్నది. ప్రజలు lift irrigation ను ఉపయోగించడానికి ఎక్కువ ఆత్రపడుతున్నారు. అనేక రైతులు అర్జీలు కూడపెట్టుకున్నారు. ఇప్పుడు చోడవరం వరకు extension ఇవ్వబడింది. అక్కడనుంచి మాడుగులవరకు extension ఇచ్చినట్లయితే, చాలా ఉపయోగకరంగా లాభదాయకంగా ఉంటుంది. ఈ విషయం గురించి ఇదివరకు composite state లో చర్చించటమేగాక గవర్నమెంటుకు అనేక మెమోరాండములు పెట్టుకోవడం జరిగింది. దీనికి investigation కూడ జరిగింది. కనుక ఆ విధంగా

Sri K. V. Ramesam] [15th March 1954

extend చేసి line కు ఇరుప్రక్క ల ఉన్నటువంటి గ్రామాలకు power సప్లయిచేసే ఏర్పాట్లు చేయవలసిందని కోరుతూ విరమిస్తున్నాను.

Sri T. LAKSHMINARAYANA REDDI.— అధ్యక్షా, ఈనాడు రాయలసీమలో తుంగభద్ర Hydro electric projectచాలా ఉపయోగపడుతుంది. ప్రత్యేకంగా 22 agencies ద్వారా కర్నూలు, అనంతపురం, బళ్లారి, కడప జిల్లాలకు చాలా ఉపయోగపడుతుంది. మాచ్ ఖండ్ ప్రాజెక్టు 1955 లో ఏ విధంగా పూర్తి అవుతుందో, అదేవిధంగానే ఈ తుంగభద్రా Hydro electric project 1958 లో కాకుండా, 1955 లోనే రాగలిగితే మా రాయలసీమ ప్రజలకు చాలా ఉపయోగపడివుండేది. ఈ ప్రాంతములో బావులద్వారానే వ్యవసాయము చేసుకొనవలసి యున్నది. కనుక ప్రత్యేకంగా ఈ తుంగభద్ర hydro electric scheme ను త్వరగా 1955 లోనే తయారయ్యేటట్లుగా చేయవలసిందని ప్రభుత్వమునకు సలహాయిస్తున్నాను.

ఇప్పుడు ప్రత్యేకంగా మా ప్రాంతములో కదిరికి ఒక thermal station ఇస్తున్నారంటే చాల సంతోషము. అందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. అదేవిధంగా ధర్మవరం, పెనుగొండలో గూడ thermal stations ఏర్పాటుచేయుటకు ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను. తరువాత హిందూపురము విషయంలో, మైసూరుతో చేసుకొన్నటువంటి agreement ప్రకారం 700 కిలోవాట్లు ఉండవలసినది. కాని ఇప్పుడు 300 కిలోవాట్లు మాత్రమే ఉపయోగపడుతున్నది, కనుక ఇంకా ఎక్కువ తీసుకొని రైతులకు ఏలాంటి ఇబ్బంది, కష్టములేకుండా చేయవలెనని కోరుచున్నాను. పక్కన మైసూరు state లో ఉన్న సౌకర్యములుచూచి, అక్కడి ప్రజలు వారికికూడ అటువంటి సౌకర్యము కలుగచేయబడునని చాలా ఉత్సాహకరంగా ఉన్నారు. కనుక వారికి తగిన సౌకర్యములు కలుగజేసి, ప్రోత్సాహమిచ్చి, ఎక్కువపంట పండించేటట్లు చేయవలసిందని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఆంధ్రదేశములో ముఖ్యంగావున్న పరిశ్రమ వ్యవసాయం.

దానిని అభివృద్ధిచేసుకోవాలంటే electricity అవసరముకాబట్టి, electricity మన రాష్ట్రానికంతటకును త్వరలో సప్లయి అయ్యేటట్లు చూడవలసినదని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. రాష్ట్రము అంతట అంటే గ్రామగ్రామానికి electricity రావాలంటే, ప్రభుత్వానికి యిబ్బందులు వుండవచ్చు. కాని, వీలు అయినన్ని గ్రామాలకు సప్లయి అయ్యేటట్లు చూడాలంటాను. ఆంధ్రదేశములో వ్యవసాయమే ముఖ్యమైందిగనుక, దానిని మనము వృద్ధిలోనికి తీసుకొనివచ్చే అవకాశములున్నవి కనుక, వృద్ధిచేసుకోవాలి. ఇందుకు వ్యవసాయమంత్రి ఎక్కువగా శక్తి వంచన లేకుండా కృషిచేస్తారని ఆశిస్తున్నాను. ప్రభుత్వము విద్యుచ్ఛక్తిని రాష్ట్రమంతటను సరఫరా చేయాలని ఉద్దేశించుచున్నప్పుడు మన వ్యవసాయానికి ఎక్కువగా ఉపయోగపడేటట్లుగా చూడాలి. విద్యుచ్ఛక్తి సరఫరా చేయించుకొనటానికి ప్రతిపక్షసభ్యులుగూడా ఒప్పుకుంటున్నారు. కాబట్టి, వారియొక్క సహాయము, సలహాలు తీసుకొని కృషిచేయాలని మంత్రిగారిని కోరుతున్నాను. విద్యుచ్ఛక్తిని, ఇండ్లలో దీపాలకైతేనేమి, వ్యవసాయాభివృద్ధికి అయితేనేమి, పరిశ్రమలుకైతేనేమి, అన్ని విధాలా ఉపయోగపడేటట్టు చూడాలి. ఈ విద్యుచ్ఛక్తిని తక్కువఖర్చుతో, ఎక్కువగా ప్రజలకు ఉపయోగ పడేటట్లు చేయాలి. ప్రజలు ఎక్కువఖర్చు భరించలేనిస్థితిలో ఉన్నారని మంత్రిగారికి తెలుసు అందువల్ల యీ విద్యుచ్ఛక్తికిగాను వ్యవసాయదార్లుగాని, పరిశ్రామికులుగాని ఎక్కువఖర్చును భరించనవసరము లేకుండా, తక్కువఖర్చుతో పనులు నెరవేరేటట్లుగాచేయాలి. ముఖ్యంగా రాయలసీమప్రజలు చాలామంది పేదవారు. ఎక్కువ ఖర్చును భరించలేరు. వారికి యీ విద్యుచ్ఛక్తిని అందుబాటులో ఉండేటట్లుచేసి, రాయలసీమ ప్రజలను వృద్ధిలోకి తీసుకొనిరావలసిందిగా మంత్రిగారిని కోరుతూ విరమిస్తున్నాను..

* Sri D. SEETHARAMIAH:—అధ్యక్షా, ఈ electricity డిమాండు విషయములో నేను కొన్ని ముఖ్యమైన సలహాలు మంత్రివర్గానికి యివ్వదలచుకున్నాను. మన ఆంధ్రదేశములో చాలావరకు థర్మల్ స్టేషనులుమాత్రమే వున్నవి. హైడ్రో ఎలక్ట్రిక్ పవరు చాలా తక్కువగావున్నది. Hydro electric పవరు మనకు యింకను అందు

Sri D. Seetharamiah] [15th March 1954

బాటులోకి రాలేదు. థర్మల్ పవరు ధర హెచ్చుగావుండుటవలన వ్యవసాయానికి నిరుపయోగంగా వుంది. 1950-51 administration report పరిశీలించినట్లైతే, చాలా తక్కువగా బావులకు థర్మల్ పవరు ఉపయోగిస్తున్నట్లు తెలుస్తున్నది. విజయవాడ థర్మల్ స్టేషనుక్రింద 83 బావులకు, electric పవరు సప్లయి అవుతున్నట్లు తెలుస్తున్నది. Ceded districts లో స్కీములక్రింద అనంతపురము, కడప జిల్లాలలో మరీ తక్కువ బావులకు పవరుసప్లై కాబడుచున్నది. వీటిఅన్నిటికిని తక్కువధరకు విద్యుచ్ఛక్తి అందుబాటు అయ్యేటట్లు చూడాలి. ఇండ్లలో దీపాలకు, పంకాలకుకంటె, ముఖ్యంగా వ్యవసాయానికి యీ విద్యుచ్ఛక్తిని ఎక్కువగా ఉపయోగించుకొనేటట్లు చూడాలి. వ్యవసాయానికి థర్మల్ విద్యుచ్ఛక్తి సరఫరా చేయుస్తే, యూనిట్‌ధర జాస్తిఅవుతుంది. ఉదాహరణకు మదనపల్లిలో వ్యవసాయమునకు వస్తున్న కరెంటు యూనిట్ ఒకటింటికి రు. 0-2-9 అవుతున్నది. డిసెల్ పంపు సెట్లకన్నా యిది ఎక్కువఖరీదుగా వున్నది. హైడ్రోపవరు ధర చాలా తక్కువగా వుండుటవలన వ్యవసాయానికి యెంతో లాభకరంగావున్నది. మైసూరు స్టేటులో వ్యవసాయానికి యూనిట్ 1 కి, 0-0-6, మెట్టూరు యూనిట్‌ధర 0-1-3 మాత్రమే. కాని థర్మల్ పవరు యూనిట్ ధర 0-2 9 వరకూ వున్నది. ఈ ధర డిసెల్ యింజన్లు ఉపయోగిస్తే అయ్యేఖర్చుకన్నా, చాలా హెచ్చుగా ఉన్నది. అందువలన బావులకు చాలా తక్కువమంది రైతులు థర్మల్ పవరును ఉపయోగిస్తున్నారు. ఇటువంటి పరిస్థితులలో థర్మల్ పవరును వ్యవసాయానికి తక్కువధరకు సప్లయిచేస్తేనే, వ్యవసాయదార్లు యీ విద్యుచ్ఛక్తిని ఉపయోగించుకోగలరు. భరించలేని ఖర్చులు యీ వ్యవసాయదార్లమీద వేస్తే ప్రయోజనము ఉండదు. థర్మల్ పవరును Concessional rates కు, వ్యవసాయానికై సప్లయి చేయాల్సిన అవసరము వుంటుంది. మంత్రిగారు యీ విషయములో తగుశ్రద్ధ తీసుకొని వ్యవసాయదార్లకు యీ విద్యుచ్ఛక్తి తక్కువ ధరకు సరఫరా చేసారని ఆశిస్తున్నాను.

ఇంతేకాకుండా, చిత్తూరు జిల్లాకు తుంగభద్రనుంచి Hydro electric power supply చేసే అవకాశాలు లేవని మంత్రిగారు

చెప్పారు. అలాంటి పరిస్థితులలో మెట్టూరునుంచి అయినను హైడ్రో పవరును తెప్పించవలసిన అవసరమున్నది. మన ప్రభుత్వం ఆప్రభుత్వం వారితో సంప్రదింపులు జరిపి, అక్కడి విద్యుచ్ఛక్తి మా చిత్తూరు జిల్లాకు వచ్చేటట్లు చేయగోరుతాను. ఇదివరకు అక్కడి ఇంజనీర్లుగూడా చిత్తూరుకు మెట్టూరునుంచే కరెంటు రావలసివుంటుందని తెలియజేస్తావున్నారు. పీలేరు, వాయిల్‌పాడు మదనపల్లి వగైరా ప్రదేశాలకుగూడా, మెట్టూరునుంచి వస్తుందని ఆశిస్తున్నారు. ఇంకో విషయం. మదనపల్లి శ్రీనివాసపురమునకు 25 మైళ్ళ దూరములో ఉన్నది. అక్కడినుంచి మదనపల్లికి కరెంటు సప్లయి చేయించుకొనే అవకాశాలు ఉన్నందున, మైసూరు గవర్నమెంటు వారితోగూడా సంప్రదింపులు జరిపి, మా చిత్తూరు జిల్లాలోని మదనపల్లి, వాయిలపాడు, పీలేరు మొదలగు ప్రదేశాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయించవలసిందిగా కోరుతున్నాను. అక్కడినుంచి సప్లయి అయ్యేటట్లుగావుంటే, యూనిట్‌ధర చాలా తక్కువగా ఉండును. కరువుప్రాంతాలైన మదనపల్లి, వాయిలపాడు తాలూకాలలో వ్యవసాయాభివృద్ధికి ఇది చాలా లాభకరం. మా చిత్తూరుజిల్లాలో యిప్పటికి ఆరుసంవత్సరాలుగా క్షామంతో ప్రజలు చాలా కష్టాలు పడుతున్నారు. అక్కడికి మెట్టూరు మైసూరు విద్యుచ్ఛక్తిసప్లయి అయితే, ప్రజలు వ్యవసాయము చేసుకొని, జీవించటానికి అవకాశము వుంటుంది. క్షామంకూడా చాలావరకూ తగ్గుతుంది. చిత్తూరు జిల్లాలో lift irrigation చాలా ప్రధానమైనది. కానీ, థర్మల్ పవరు ద్వారా lift irrigation సాధ్యంకాదు కాబట్టి, మెట్టూరునుంచి కొన్ని ప్రదేశాలకు, శ్రీనివాసపురం ద్వారా కొన్నిచోట్లకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయిస్తే, క్షామం చాలావరకు తగ్గిపోతుంది. శ్రీనివాసపురంనుంచి మదనపల్లివరకు సులభముగా యీ విద్యుచ్ఛక్తిని సరఫరా చేయించుకోవచ్చు. కాబట్టి మా చిత్తూరు జిల్లాలో వ్యవసాయాభివృద్ధికిగాను ప్రభుత్వం సత్వరంగా మైసూరు, మద్రాసు ప్రభుత్వాలతో సంప్రదింపులు జరిపి, విద్యుచ్ఛక్తి సప్లయిచేయటానికి ఏర్పాట్లు చేయవలసిందిగా కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

Sri L. LAKSHMANA DAS:—అధ్యక్షా, ప్రభుత్వం యీరోజున ప్రవేశపెట్టిన elctricity demand ను నేను బల

Sri L. Lakshmana Das ] [ 15th March 1954

పరుస్తున్నాను. electricity supply చేసే విషయములో ప్రభుత్వం తీసుకొన్న చర్యలపట్ల ప్రభుత్వాన్ని మనమందరము అభినందించవలసి యున్నది. ప్రభుత్వం యీ విషయంలో చాలా ప్రయత్నాలు చేస్తున్నది. శీఘ్రంలో మన రాష్ట్రమంతయు విద్యుచ్ఛక్తి సప్లయి కాబడుతుందని ఆశిస్తున్నాను. ప్రభుత్వంవారి ప్రయత్నాలు ఆచరణ యోగ్యము కాగలవని నమ్ముతున్నాను. థర్మల్ పవరుకంటే, hydro electric పవరుద్వారానే మన ఆంధ్రదేశములో సామాన్య వ్యవసాయ పారిశ్రామికులకుగాని, చేనేత పారిశ్రామికులకుగాని యెక్కువగా యీ విద్యుచ్ఛక్తి సరఫరా చేయ సులభమని శ్రీ సంజీవరెడ్డిగారు చెప్పారు. ఈ రెండు విధములా దేశములో సాధ్యమైనన్ని చోట్లకు విద్యుచ్ఛక్తి సప్లయి చేస్తారని అనుకుంటున్నాను. ఈ విషయములో ప్రభుత్వము శీఘ్రచర్యలు తీసుకోవలసిందని విజ్ఞప్తి చేస్తున్నాను. మాచ్ ఖండ్ విషయములో యిప్పటి పరిస్థితులకు అక్కడి contractors చాలా వరకు కారణభూతులని అంటున్నారు, అంతేకాకుండా అక్కడవున్న లేబరుకు గూడా చాలా అన్యాయము జరుగుచున్నదని ప్రభుత్వానికి తెలియజేస్తున్నాను. ఈ విషయంతో శ్రీ సంజీవరెడ్డిగారు పరిస్థితులను జాగ్రత్తగా పరిశీలించుతానని అన్నారు. వారు తప్పకుండా అక్కడి లేబరుకు సహాయము చేయవలసిందిగా కోరుతున్నాను. ముఖ్యంగా మాచ్ ఖండు స్కీము పూర్తి అయ్యేలోగా, దానికి ప్రక్కనవున్న శ్రీకాకుళంజిల్లాకు గూడా విద్యుచ్ఛక్తి సరఫరా చేయటానికి యిప్పటినుంచి కావలసిన చర్యలు తీసుకోవాలని చెబుతున్నాను. కారణమేమిటంటే, యిప్పటినుంచి కొన్ని electric lines మాచ్ ఖండునుంచి వేస్తున్నారు. శ్రీకాకుళంజిల్లాకు యింకను ఆరంభించలేదు కాబట్టి, ఆజిల్లాలో గూడ electric lines వేయించమని మనవిచేస్తున్నాను. ఏ కారణముచేతనో, యీ విషయములో చాలా ఆలస్యము జరుగుతున్నది. ప్రజలు యీ ఆలస్యమువల్ల చాలా నిరాశ, నిస్పృహ చెందుతున్నారు. అందువల్ల నేను ప్రభుత్వానికి మనవిచేసేది యేమిటంటే శ్రీకాకుళం జిల్లాలో అన్ని ప్రాంతాలకు వ్యవసాయానికి తోడ్పడేటట్లు electric lines వేయించవలసి వున్నది. అక్కడ చేనేత పారిశ్రామికులకుగూడా

విద్యుచ్ఛక్తి సప్లయిచేస్తే, చేనేతపనులుగూడ వృద్ధికి తెచ్చుకుంటారు. వారికిగూడా ఎక్కువ ఉపయోగపడగలదు. ప్రభుత్వంవారు యీ విద్యుచ్ఛక్తి మా శ్రీకాకుళం జిల్లాలో అన్ని ప్రాంతాలకు సరఫరా చేయించటానికి శీఘ్రచర్యలు తీసుకోవాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. ప్రభుత్వము యీ విషయములో శ్రద్ధ తీసుకొంటున్నందుకు మంత్రివర్గానికి నేను నా ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

Sri PRAGADA KOTAIAH:—అధ్యక్షా, లక్ష్మణదాసుగారు మాట్లాడుతూ శ్రీకాకుళం జిల్లాలో చేనేత పారిశ్రామికులు లక్షల కొలది, వేలకొలది వున్నారు, వారికి electricity సప్లయి చేయించాలని అంటున్నారు. అక్కడ చేనేత పారిశ్రామికులకు electricity supply చేయాలని అంటే లాభములేదు. విద్యుచ్ఛక్తి సరఫరాతో చేనేత పరిశ్రమలు, అభివృద్ధి చెందవు. బట్టల యంత్రాల పోటీనుంచి రక్షణకావాలి. కాంగ్రెసు సభ్యులుగావుండి, అక్కడి చేనేత వారందరికి పనులు ప్రభుత్వం కల్పించాలని కోరుతూ మాట్లాడవలసియున్నదనే సంగతి గుర్తించుకొని మాట్లాడితే బాగుండేదని నేను భావిస్తున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI:— మిత్రులు చాల మంది చాల సలహాలను యిస్తూ మాట్లాడారు. అందులకు వారందరిని నేను అభినందిస్తున్నాను. వారందరి మంచిమంచి సలహాలను నేను హృదయపూర్వకముగా అంగీకరిస్తున్నాను. అందులో ముఖ్యంగా శ్రీ ఖండవల్లి కృష్ణారావుగారు కొన్ని సలహాలను యిచ్చినారు. వారు యిప్పుడు సభలో లేరు. వారు చెప్పిన సలహాలు చక్కగా, చాలా మంచివిగా వున్నవి. వారు యిక్కడ అసెంబ్లీలో యిచ్చిన సలహాలే కాదు, చాలసార్లు సహాలనిస్తూ యెక్కడెక్కడో wastage యెక్కువగా వుందన్నారు. ఇప్పుడు అసెంబ్లీలోనేకాకుండా యిదివరలో నా office గదులలోను తదితర చోట్ల వారు సలహా నిస్తూవచ్చారు. వారు చెప్పేటప్పుడు యెక్కువగా wastage అవుతున్నదనే చెప్పారుగాని, ఆ wastage తగ్గించడానికి మార్గాలను చూపించి, నాకు సహాయపడినట్లయితే, యిలాంటి యిబ్బందులు, నష్టాలను తొలగించడానికి నేను

Sri N. Sanjeeva Reddi] [15th March 1954

ప్రయత్నించేవాడిని. ఆలాగున వారు remedies ను కూడ suggest చేస్తే వాటిని నేను మనస్ఫూర్తిగా అంగీకరిస్తాను.

శ్రీ పిడతల రంగారెడ్డిగారు మార్కాపురం గురించి చెబుతూ, యేవో Indian Tariff Board కు సంబంధించిన కొన్ని పాతకాగితా లను records లో నుండి తీసుకువచ్చి, చదివి వినిపించారు. వారు అవన్నీ చదివారంటే Congress Party Whip అయినారు కనుక మార్కాపురం గురించి ప్రత్యేకంగా చెప్పారు. మార్కాపురం ఒంగో లుకు తుంగభద్రకు మధ్య వున్నది. కాబట్టి, యేదైనా ఒక diesel station గాని, thermal station గాని పెట్టడానికి వీలవుతే. తరువాత hydro electric power క్రింద వచ్చేటట్లుగా వీలుంటే, అటువంటి దానిని సమగ్రంగా పరిశీలించి చేయవలసినది తప్పకుండా చేస్తాము. బహుశా hydro electric power రాదని భావిస్తున్నాను. వారు కొన్ని మార్గాలను సూచించారు. వాటిలో ఒకటితీసి, యీ మార్కాపురంలో విషయంలో వారికి సహాయపడడానికి ప్రయత్నం చేస్తాము.

శ్రీ పోతరాజు మొదటినుంచీ కూలీల విషయమై చెప్పారు. వారు యిందుకు సంబంధించి చెప్పినది నేను గమనిస్తూనే వున్నాను. వారొక ప్రస్తావన తెచ్చారు. అందులోవుండే workers యొక్క కష్టనిష్ఠూరా లను అటుంచి, మిగిలినవారు కోరేకోర్కెలను నేను అంగీకరిస్తానని ముందుగా చెప్పలేను గాని, వారు చెప్పిన compensation యివ్వడానికి ఆలోచిస్తాను. మాచ్ ఖండ్ కు నేను త్వరలోనే పోవుచున్నానని చెబు తున్నాను. మాచ్ ఖండ్ లో పనిచేసే యేడుగురు కూలీలు (workers) మరణించారన్నారు. వారి మరణానికిగల కారణాలు అన్నీ తెలుసుకొని, వారికి యెందుకు compensation యివ్వలేదో, ఆ విషయాన్ని సమ గ్రంగా పరిశీలిస్తాను. అందుకు చాలవరకు నేను వారితో యిప్పటికే యేకీభవిస్తాను. వారికి compensation యివ్వడానికిగల యిబ్బందు లను అన్నీ తెలుసుకొనడానికి ప్రయత్నం చేస్తాను.

శ్రీ పి. పుండరీకాక్షాచార్యులుగారు చెప్పినది నేనూ చేయాలనే ఆశిస్తున్నాను.

15th March 1954 ] [Sri N. Sanjeeva Reddi

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు యిదివరలో retrench కాబడినవారికి electricity schemes లో క్రొత్తగా employ చేసేటప్పుడు priority యివ్వాలని చెప్పారు. అది సాధారణంగా జరిగే పనే. ఎప్పుడైనా staff ను retrench చేస్తే, వారికి యేదైనా ప్రత్యేకంగా నేరాలు వుంటేతప్ప, అటువంటి వారిని ఖాళీలు యేర్పడినప్పుడు వుద్యోగులు వెంటనే తీసుకోవడమనేది మన ప్రభుత్వ ఆచారంగా వుంది. ఎక్కడైనా ఒకటి, రెండు పొరపాట్లు జరుగుతే, అటువంటి కేసులు నా దృష్టికి తీసుకువస్తే, వారికి తప్పకుండా సహాయం చేయడానికి, వారిని తిరిగి తీసుకోవడానికి ప్రయత్నం చేస్తాను. అలాంటివి సరిచేయడానికి నేను సిద్ధంగా వున్నాను. ఎక్కడైనా వారిపై bad records వుంటే, అటువంటివారిని తీసుకొనే విషయం నేను చెప్పలేను. కాని, ఖాళీవుంటే రికార్డు బాగుంటే అటువంటివారిని తిరిగి తీసుకోవడమనేది ప్రభుత్వ విద్యుక్తధర్మము. అటువంటి వారిని తీసివేస్తే, అలాంటికేసులు నా దృష్టికి తీసుకవస్తే వాటిని సరిచేయడానికి నేను సిద్ధంగా వున్నాను.

శ్రీ కె. వరదాచారిగారు మాట్లాడుతూ, చిత్తూరుజిల్లా విషయం చాలా చెప్పారు. చిత్తూరుజిల్లా రెండు ప్రాంతాలమధ్య వున్నది కాబట్టి, అచ్చట త్వరలో రాదని చెప్పాను. అయినప్పటికీ, కొన్ని కిలో వాట్స్ యివ్వడానికి సంబంధించిన విషయం మద్రాసు ప్రభుత్వము చేతిలోవుంది. దానిని గురించి దశరథరామయ్యగారు యింతకు పూర్వము చెప్పారు. వారు దారిలోవుండే గ్రామాలపేర్లు చాల చెప్పారు. మదనపల్లిలో Sub-station పెట్టడానికి మద్రాసు ప్రభుత్వము పూనుకోవాలి. ఈ సందర్భంలో electricity అక్కడ పెట్టడానికి Chief Engineer అంగీకరించారు. రెండు ప్రభుత్వాల Chief Engineers అంగీకరించిన తర్వాత, ఆproposal మద్రాసు ప్రభుత్వమునకు పోయింది. కాబట్టి, మద్రాసు ప్రభుత్వంతో మనము ఒక agreement కు వచ్చే పరిస్థితులు వున్నాయి. అదివస్తే, చిత్తూరు జిల్లా చాల బాగుపడుతుంది. మనం వారితో ఒక ఒప్పందానికి రాగల్గుదుమనే నేను ఆశిస్తున్నాను.

Sri K. VARADACHARI:—మద్రాసు ప్రభుత్వం వారిని మొంత quantity యివ్వవలసినదని మీరు అడుగుతున్నారో, అందుకు సంబంధించిన details చెబుతారా?

The Hon. Sri N. SANJEEVA REDDI:— ఎక్కువగా వస్తేసంతోషమే. అంతేకాకుండా, వారు కొంతవరకు యిందు సంబంధించి యివ్వడానికి వీలవుతుందని నేను అనుకొంటూన్నాను. అది వారి జిల్లాలో కొంతవరకు సరఫరా చేయడానికి వుపయోగపడుతుంది. ఇక వారు పుత్తూరు తాలూకా గురించి చెప్పారు. ఇంతవరకు electricity నెల్లూరునుండి కాళహస్తివరకూ, నెల్లూరునుండి గూడూరువరకూ వచ్చింది. అయితే, శ్రీ నీలం సంజీవరెడ్డి మెంబరుగాను, మంత్రిగాను అయిన తరువాత వచ్చినదికాదు. పూర్వమువున్న plans ప్రకారమే వాటిని నేను execute చేస్తూవచ్చాను. అందుచేత ఒక ప్రాంతమునకు వచ్చిన తరువాత, దానికి ప్రక్కనవున్న గ్రామాలకు, పల్లెలకు, యింకా ప్రక్కనవున్న పుత్తూరు, తిరుత్తణి తాలూకాలకు తీసుకుపోగలమని ఆశిస్తున్నాను.

శ్రీ చల్లా సుబ్బరాయుడుగారు మాట్లాడుతూ, చిత్తూరు జిల్లాలో భావులకు electricity యిస్తే, బాగుపడుతుందని చెప్పారు. తాడిపత్రి సైడునవున్న గ్రామాలకు పోవటం కష్టము చాలా భావులకు supply చేస్తే, పంట అభివృద్ధి చెందుతుంది. అక్కడ భావులు తక్కువగానే వున్నవి. నీళ్ళు లేకపోయి వున్నవి. చాలాదూరం తీసుకుపోవాలి. 4 మైళ్ళదూరం తీసుకుపోవాలంటే, చాలా extra-ordinary cost అవుతుంది. Industrial load ను develop చేసి, production యెక్కువచేయాలంటే అందుకు electricity యింకా 4 మైళ్ళు తీసుకుపోవడానికి అక్కడ consumption వుండాలి. కొంత electricity consume అయితేనే గాని, తీసుకొని వెళ్ళిన ప్రయోజనం వుండదు అనే దానిని గమనించాలి. దగ్గరలో చిన్న చిన్న గ్రామాలకు తప్పకుండా తీసుకుపోబడుతుందని నా వుద్దేశ్యము. తాడిపత్రిదగ్గర ఒక thermal station ను వేయించటానికి అప్పుడు పట్టుపట్టినవారిలో నేనొకడిని. ఇంకా పది గ్రామాలకు

తీసుకుపోగల్గితే! నాకూ చాలా సంతోషమే. అందుచేత, అది సాధ్యమవుతుందా లేదా అనే విషయం నేను Chief Engineer కు వ్రాసి తెలుసుకొని, అంతా సవిస్తరంగా విచారిస్తాను.

శ్రీ కె. వి. రామేశంగారు మాట్లాడుతూ వారు courts లో పంకాలు కావాలంటున్నారు. కోర్టులలో పంకాలు లేవు. చాలా బాధపడుతున్నారు అని చెప్పారు. అందువల్ల, కోర్టులలో తప్పకుండా పంకాలు పెట్టేటట్లు ప్రయత్నం చేస్తాము.

శ్రీ టి. లక్ష్మీనారాయణరెడ్డిగారు చెప్పిన విషయాల గురించి ప్రశ్నోత్తర కాలంలోనే నేను చెప్పాను. కాని మొన్న నేను thermal station విషయమై చెప్పడం మరచిపోయాను. ధర్మవరంకు అనంతపురం నుంచి తీసుకొని వెళ్లాలంటే వీలుంటే చేయ ప్రయత్నిస్తాము. మైసూరు ప్రభుత్వముతో correspond చేసి, negotiations జరిపిన తరువాత, వారితో ఒక ఒడంబడికకు (agreement) చేసే ప్రయత్నం ఫలిస్తే, తప్పకుండా అనంతపురంనుంచి ధర్మవరం వరకు వచ్చేటట్లుగా ప్రయత్నిస్తాము. (Penukonda) పెనుకొండకు అవసరమైన line యివ్వడం లేదన్నారు. కదిరిలో పెట్టడానికి వారు యిచ్చిన సలహా ప్రకారము అంత cheap గా అవుతుందా అని ఆలోచించి, at least next budget లో తీసుకొని, అంతా ex mine చేసి, యెంతో వుపయోగపడేటట్లుగా అక్కడ చేస్తాము. Dharmavaram, మదనపల్లి మొదలైనవి మైసూరుకు దగ్గరగా వున్నట్లుగానే మైసూరుకు, బళ్లారి, అనంతపురం, చిత్తూరు దగ్గరగావున్నవి కాబట్టి అక్కడక్కడ electricity ని extend చేయమంటున్నారు. దగ్గరగా వున్నాయని యెక్కడపడితే అక్కడ tap చేసి, అక్కడనుంచి తీసుకుపోవాలంటే అది అంత వీలయ్యేపనిగాదు. ఇప్పటికే మనం బళ్లారిలో Tekke అనే గ్రామంవద్ద tap చేయటం, ఒకటో, రెండో, మూడో points తీసుకొని, వారు యిచ్చిన powerను distribute చేసుకుంటే బాగుంటుందని అంటున్నారు. మళ్లీ అక్కడ యేదో stationsను తీసుకొని distribution పెట్టుకోవాలంటే, అనేక యిబ్బందులు వుంటాయి. మైసూరు ప్రభుత్వంవారు యిచ్చే power అంతా distribute చేసి యిస్తున్నారు. మనకు మద్రాసునుంచి వస్తున్న

Sri N. Sanjeeva Reddi] [15th March 1954

విద్యుచ్ఛక్తి పెనుగొండ మరి యితరప్రాంతాలకు తీసుకువెళ్లడము వీలగునేమో ఆలోచిస్తాము.

శ్రీ లుకలాపు లక్ష్మణదాసుగారు శ్రీకాకుళం గురించి చెప్పారు. వారు అదృష్టవంతులు. మాచ్‌ఖండ్ ప్రక్కనే వున్నారు. మొదట వారికిచ్చి, మిగతావారికిస్తాము. కాని దూరంగా వున్నవాటికి వచ్చిన తరువాత వారికే రావాలన్న దూరాలోచన వారికి వుండాలి. అక్కడ party వారు వున్నారని కాదు. శ్రీకాకుళం జిల్లాతో నాకు పరిచయం వుంది. కాబట్టి, అది చాలా పేదతనంగా వున్న area కాబట్టి, దానికి ప్రత్యేకంగా నాలుగు projects యిచ్చాము. electricity ఆ జిల్లాలో యేర్పాటు చేస్తున్నాము. అని శ్రీ లక్ష్మణదాసుగారికి నేను చెబుతున్నాను. ఏదైనా యీ విషయాలలో తెలుసుకోవాలంటే, నాకుకూడా అంత technical matters తెలియవు. ఏదైనా Chief Engineer గారు చెప్పవలసినదే. సభవారు యింకేమైనా తెలుసుకొనగోరుతే నాకు ఒక ప్రశ్నరూపకంగా యిస్తే, దానికి వెంటనే reply తెప్పించి యిస్తాను. ప్రశ్నోత్తర కాలంలో మొక్కువకాలం ' వుండబట్టి, యీ విషయం తరచూ ప్రస్తావిస్తున్నాం. శ్రీ కృష్ణారావుగారు యెక్కడ wastage వుందో, దానిని అరికట్టడానికి సూచనలు చేస్తే, దాని విషయం పూర్తిగా కనుక్కుంటాను. వారు wastage వుందని point out చేయడంవల్ల నాకు విచారం యేమీ లేదు. కృష్ణారావుగారు యేమైనా constructive suggestionsయిస్తే, వాటిని నేను సంతోషపూర్వంగా స్వీకరిస్తాను. కాబట్టి ఎక్కడైనా లోపాలు జరుగుతున్నాయంటే ఫలానా లోపం జరుగుతోందని చెపితే, దాన్ని సరిచేసుకోడానికి ప్రయత్నం చేస్తాం. ఆరకంగా నాకు సహకారం ఇవ్వండి. వేస్టేజి కాని, లంచగొండితనం కాని ఉండడం నాకు ఇష్టంలేదు. కాబట్టి మీసహకారాన్ని కోరుతూ దీన్ని ఏకగ్రీవంగా ఆమోదించమని కోరుతున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఇదివరకు మద్రాసులోఉండగానే priority లో కొన్నిస్కీములు sanction చేశారు. ఆ శాంక్షన్ చేసిన స్కీములు తీసుకునేముందు రాజగోపాలాచారిగారి ఆర్డర్సు మూలంగా ఆగిపోయాయి. ఇప్పుడు మీరు కొత్త prio-

rities తయారు చేస్తున్నారా? లేక ఇదివరకు ఉన్నదాని ప్రకారం తీస్కుంటున్నారా? వాటిని గురించి ప్రభుత్వం ఏమైనా చెపితే బాగుంటుంది.

The Hon. Sri N. SANJEEVA REDDI:-ఎంతవరకు నాకు sanctioned amount ఉంటుందో దాన్నిబట్టి తీస్కొనుని చెప్పాను. వాలంటరీ లోన్సు ప్రకారం sanction అయిన schemes ఏమైనా ఉంటే వాటిని వెంటనే తీస్కొనుని చెపుతున్నాను. మీకు ఏదైనా details కావాలంటే question పంపించండి దానికి సమాధానం పంపిస్తాను.

Mr. SPEAKER :— The question is :

"That the allotment of Rs. 93,37,300/— under Demand XXVII-Electricity, be redused by Rs. 100/—"

The motion was lost.

Mr. SPEAKER :— The question is :

"That the Government the granted a sum not exceeding Rs. 93,37,300 under demand XXVII Electricity."

The motion was carried and the demand was granted.

---

## DEMAND VI — MOTOR VEHICLES ACTS.

The Hon. Sri N. SANJEEVA REDDI :— Sir, On the recommondation of the Governor, I move :

"That the Government be granted a sum not exceeding Rs. 5,08,600 under Demand VI - Motor Vehicles Acts."

అధ్యక్షా, ఈ మోటార్ వెహికిల్స్ గురించి ఎక్కువగా చెప్ప వలసిందేమీ లేదు. అది మిత్రులందరికీకూడా తెలుసు. దీనిమీద టాక్సు చాలా బలంఅవుతోంది. బస్సులు పెట్టుకొన్నవారు అంతా

కూడా ఈ మధ్య చాలా తీవ్రమైన ప్రచారం సాగిస్తున్నారు. వారికి కొంత ఆదాయం తగ్గిందనే విషయం నేనూ ఒప్పుకుంటాను. ఈరోడ్లకు అయ్యే ఖర్చులో ఏ కొద్దిభాగమో యీ మోటారువాళ్ళవల్ల ప్రభుత్వానికి వస్తున్నది. కాలినడకను పోయేవాళ్ళవల్ల ఈ రోడ్లు చెడిపోవు. మంచిరోడ్లు యీ మోటారుబళ్లు నడిపేవాళ్ళకే కావాలి. వాళ్ళవల్లే యీ రోడ్లు ఎక్కువగా చెడిపోతుంటాయి. ఆ రోడ్ల ఖర్చంతా కూడా వీళ్ళవల్ల సంపాదించుకోగలిగితే బాగుంటుంది. కాని ఏ కొద్దిభాగమో గాని వాళ్ళనుంచి మనం సంపాదించలేకుండా ఉన్నాం. మనం ప్రస్తుతం ఏ పరిస్థితుల్లో ఉన్నామో చూడండి. ఇంకా electricity, irrigation మొదలైన వాటిల్లో improve కావలసివుంది. కొన్ని రూట్లలో ఉండే బస్సువాళ్ళ పరిస్థితులు చాలా కష్టంగా ఉన్నాయి, వాళ్ళకు చాలా నష్టంవస్తోంది అని చెపుతున్నారు. జనసంఖ్య చాలా తక్కువగావున్న రూట్లలో చాలా నష్టంవస్తున్నది. కాని అన్ని రూట్లలోను ఆ పరిస్థితులే ఉన్నాయని నమ్మడానికి వీలులేదు. చాలా రూట్లలో చాలా లాభాలు వస్తున్నాయి. కొన్ని కొన్ని రూట్లలో రూట్‌బస్ ఫేలైతే స్పేర్‌బస్‌కు ఎవరూ application కూడా పెట్టకుండా ఉన్నారు. కాని కృష్ణాజిల్లాలో ఒక రూట్‌కు applications పిలిస్తే, కొన్నివందల applications వచ్చాయి. నిజంగా నష్టం వస్తుంటే ఇన్ని applications పెట్టడం ఎందుకు ? కాని కొన్నిరూట్లలో నష్టంవస్తున్నది, కొన్ని రూట్లలో లాభంవస్తున్నది. మొత్తంమీద లాభంవచ్చేరూట్లు చాలా ఉన్నాయి. కాని ఈ మోటారు ట్రాన్స్‌పోర్టుకు సంబంధించిన విషయలన్నింటిమీద ఒక సమగ్రమైన నివేదికను పంపమని ఒక ఉద్యోగిని నియమించాలని అనుకుంటున్నాను. ఉద్యోగి అంటే గవర్నమెంటు ఉద్యోగికాదు. శ్రీ రామనాథన్ మన యూనివర్సిటీలో ప్రొఫెసరు. ఆయనను నియమించడంవల్ల ఏమీ నష్టం లేదు. ఆయన ఈ సబ్జెక్టులో బాగా చదువుకున్నవారు. దీనిమీద కొన్ని పుస్తకాలుకూడా వ్రాశారు. వారిని నియమించి వారి ద్వారా ఏదైనా సమాచారం సేకరించిన తరువాత ఈ విషయంలో ఒకనిర్ణయం చేయాలని అనుకుంటున్నాను. సమగ్రంగా ఒకసారి పరిశీలించి, యేయే tax లు allow చేయాలో, యేయే tax లు తీసివేయాలో నిర్ణయిద్దామనుకుంటున్నాను. ఈ విషయం Motor Transport వాళ్ళకు కూడా

15th March 1954] [Sri N. Sanjeeva Reddi

తెలిపాను. ఈ లోపుల High Court వారి జడ్జిమెంటుకూడావస్తుంది. వాళ్ళు ఏమియిస్తారో చూచి ఈ taxను continue చేయడమో లేక tax తగ్గించడమో ఆలోచించవలసి వుంది. కాని ఇప్పుడు యీ tax వల్ల ఎంతవచ్చినా ప్రభుత్వానికేమీ ఉండదు. ఇదంతా జిల్లాబోర్డులకు ఇవ్వవలసిందే. ఈ రోడ్ల మెయిన్‌టెనెన్సు అంతా జిల్లాబోర్డులదే కాబట్టి వాళ్ళకే ఇవ్వవలసివుంది. ఇదంతా మీకందరకు తెలిసినవిషయమే. జిల్లాలో R. T. O. లు, Motor Vehicle Inspectors, Assistant Motor Vehicle Inspectors కూడా ఉన్నారు.

ఇంతమంది ఆఫీసర్లున్నప్పటికీ లైసెన్సులు లేకుండా తిరుగుతున్న కార్లు, ప్రత్యేకంగా రాత్రిళ్ళు దొంగతనంగా బియ్యం రవాణాచేసే లారీలన్నీ లైసెన్సు లేనివేనని తెలిసింది. నిజంగా లైసెన్సులువున్న లారీలు అంత నిర్భయంగా తిరగవేమో! ఈవిధంగా లైసెన్సులులేకుండా తిరుగుతున్న కార్లు, సామాన్యంగా ప్రతిజిల్లాలోనూ ఉన్నాయి. ఇద్దరు ముగ్గురు ఉద్యోగసులేస్తేంటే వాటినెట్లా కనుక్కోగలరు ? ఎక్కువగా ఉండాలని నా ఉద్దేశ్యంకాదు. కాని ఒక్క విషయం చెప్పడానికి సంతోషిస్తున్నాను. R. T. O. లు దాదాపు అందరూ యువకులుగావుండి బాగా ఉత్సాహంగా పనిచేస్తున్నారు. నూటికి 99 వాళ్ళు వారు న్యాయంగా ఉన్నారని చెప్పగలను. మిగతా 1 ఎక్కడైనావుంటే ఉండవచ్చు. ఆ మాత్రం safeguard లో వుంచుకుంచిది. నాకు తెలిసినంతవరకు ఉత్సాహంతోను, న్యాయ బుద్ధితోను పనిచేస్తున్నారు. leakage చాలా తక్కువగా ఉన్నది. శిక్షలు కఠినంగా యిస్తున్నారు. మంచి మంచి మార్పులు, సలహాలు యిస్తున్నారు. ఈ డిపార్టుమెంటులో మనం చేయు గలిగిన మార్పులు పెద్దగాలేవు. Taxation తగ్గించడం విషయంలో ఆలోచిస్తున్నాము. కాని ఇంకా ఒకనిర్ణయానికి రాలేదు. Advocate-general సలహా తీసుకున్న తర్వాత నిర్ణయానికి రావచ్చు. ఇది చాలా చిన్నమొత్తం. దానినందరు ఏకగ్రీవంగా ఆమోదించవలసినదిగా కోరుతున్నాను.

ఇక డ్రైవర్లు First Aid లో శిక్షణపొంది సర్టిఫికేట్లు కలిగిన వారైవుండాలనివుంది. మోటార్లకు ఎక్కడైనా ప్రమాదం సంభవించి ఎవరికైనా దెబ్బలు తగిలితే వారికి కొంతవరకైనా సహాయం చెయ్య

డానికి ఇది ఉద్దేశించబడింది. కాని ఈ పద్ధతి డిశంబరునుంచిగాక, మార్చి నుంచి అమలులోకి వచ్చేటట్లు ఉత్తర్వుచేశాను. ఇది అంత అవసరమైనదిగా అనుకోను. కారులోవున్న 30, 40 మందికి దెబ్బలు తగిలితే, ఒక్క డ్రైవరు అందరికి సహాయంచేయడం అసంభవం. దీనిని రద్దుచేయడమే మంచిదని నా వ్యక్తిగతాభిప్రాయం. దీనినిగురించి ఈ నెలాఖరులోగానే ఏదో నిర్ణయంచేస్తాను. కాబట్టి ఈ పద్దును ఆమోదించ వలసినదిగా కోరుతున్నాను.

Mr. SPEAKER :— Motion moved :

"That the Government be granted a sum not exceeding Rs. 5,08,600 under Demand VI - Motor Vehicles Acts."

Sri S. VEMIAH :— Sir, I move :

"That the allotment of Rs. 5,08,600 under Demand VI - Motor Vehicles Acts, be reduced by Rs. 100/—"

Mr. SPEAKER :— Motion moved :

"That the allotment of Rs. 5,08,600 under Demand VI - Motor Vehicles Acts, be reduced by Rs. 100/—"

All the other cut motions given notice of by members would be deemed to have been moved.

* Sri M. VEERABHADRAM :— ఈ cut motion ను నేను బలపరుస్తూ కొన్ని ప్రధానమైన సమస్యలను ప్రభుత్వదృష్టికి తేదలిచాను. మొదటిది యీ బస్సులు, లారీలు యితర కార్లమీద 1952 వ సం॥రంలో మద్రాసు అసెంబ్లీలో సర్‌ఛార్జి పన్నువిధించిన సందర్భంలో మేమందరము వ్యతిరేకించాము. దానికి కారణాలు చెపుతూ ఈపన్ను బస్సు యజమానులమీాద వేస్తున్నామని చెప్పినప్పటికీ అది చిట్టచివరకు ప్రయాణీకులమీాదే పడుతుందనీ, బస్సు యజమానులు బస్సులను నిర్వహించడంలో 1947 కు అప్పటికి టైర్లు, యితర spare parts ధరలు సుమారు 2 రెట్లు పెరిగినందున పన్నుభారాన్ని భరించలేరనీ, దానివల్ల

15th March 1954 ] [ Sri M. Veerabhadram

ఆంధ్రదేశంలో బస్సురవాణా పరిశ్రమ అంతముగాక తప్పదని చెప్పాము. కాని మేము చెప్పిన మాటలకు లెక్క-చెయ్యకుండా తమకున్న పార్టీ బలంవల్ల దానిని అప్పట్లో నెగ్గించుకున్నారు. ఈ పన్ను ఆచరణలోకి వచ్చాక చాలామంది బస్సుయజమానులు దివాళాతీశారు. ఇంకా చాలామంది యజమానులు మద్రాసులోవున్న భండారిఅనే మార్వాడీ షాహుకారుకు 1 కోటి రూపాయలదాకా అప్పుపడివున్నారు. కొన్ని రోడ్లమీద యజమానులకు చాలా లాభంవచ్చిందని మంత్రిగారు చెప్పారు. బెజవాడ, బందరులాంటి రోడ్లమీద లాభంవస్తే వచ్చివుండ వచ్చుగాని విస్తారంగా ఇతర రూట్లలో నష్టంమీదనే నడుపుతున్నారు. ఈమధ్య అనకాపల్లిలో అప్పారావు అనే బస్సుయజమాని విపరీతంగా నష్టపోయి. తనకున్న బస్సుల్లో 4 వ వంతు బస్సులను షెడ్డులలో పెట్టు కుని కూర్చున్నాడు. తగిన ఆదాయంలేక వర్క-ర్లకు జీతాలివ్వలేక పోయాడు. Law of diminishing results రంగంలోకి వచ్చింది. చాలా బస్సులు మద్రాసులోవున్న భండారికి తాకట్టుపెట్టబడ్డాయి. వాళ్ళ పరిస్థితులు యిట్లావుండగా, ఈ పన్నులు ఏదో ఒకవిధంగా ప్రయాణీకుల మీద రుద్దుతున్నారు. వాళ్ళు ఈ పన్నులకు తమ జేబులలోనుంచి పెట్టుకోవడంలేదు. ప్రభుత్వ చట్టంప్రకారం మైలుకు 7 ద మ్మిడీ లు మాత్రం వసూలు చెయ్యాలనివుంటే ఒక్క- బెజవాడ, బందరులాంటి రోడ్డుమీద తప్ప, మిగతా అన్ని రూట్లమీదకూడా షెడ్యూలు రేటుకు ఎక్కు-వగానే వసూలుచేస్తున్నారు. సర్ ఛార్జికూడా ప్రయాణీకులదగ్గర నుంచి వసూలుచేస్తున్నారు. ఈమధ్య హైకోర్టు తీర్పు వచ్చిందనీ, taxation ను తగ్గించడమో లేక బస్ రేట్లు పెంచుకోవడానికి అనుమ తించడమో చెయ్యాలంటున్నారు అంటే యింతవరకు illegal గా అమలులోవున్న రేట్లు legalise చేస్తారన్నమాట. అప్పటినుంచి బస్సు రేటుమీద రూపాయికి 0-0-9 సర్ ఛార్జీ టిక్కెట్టు మీదవేసి మనదగ్గర నుంచి వసూలుచేస్తారు.

బస్సు యజమానుల పరిస్థితి, బస్సు పరిశ్రమ ఆంధ్రదేశంలో దివాళా తీసేస్థితికి వచ్చాయి. దీనిని రక్షించకపోతే ఆంధ్రదేశంలో బస్సులు, లారీలు లేకుండాపోయి, బళ్ళు, ఒంటెద్దుబళ్ళు సిద్ధమవుతాయి. శ్రీ కోటిరెడ్డిగారు అవే కావాలంటున్నారు లెండి! బస్సు ఛార్జీలు

Sri M. Veerabhadram] [15th March 1954

ఎక్కువ వేసే విషయాలను, ఇతర విషయాలనుగురించి రిపోర్టు తయారు చేసేందుకు ఒకరిని నియమిస్తామని మంత్రిగారు చెప్పారు. ఒకరినివేస్తే మనకి అది సమగ్రమైన రిపోర్టు కాకపోవచ్చును. కనుక యిద్దరు ముగ్గురినివేస్తే బాగుంటుంది. ప్రభుత్వం తరఫున ఒకరు, యజమానుల తరఫున ఒకరు, కార్మికుల తరఫున ఒకరువుండి, రిపోర్టు సమర్పిస్తే లాభకరమైన పని జరుగుతుంది.

[Sri G. Nagabhushanam occupied the Chair]

ఈ పన్నులభారంతో కృంగిపోతున్న బస్సుయజమానులు ఆ భారాన్ని కార్మికులపై మోపుతున్నారు. అందుచే ఈ బస్ కార్మికుల స్థితి యింకా హీనమైపోతోంది. ఇదివరలో మద్రాస్ ప్రభుత్వం, 20 బస్సులు కలిపి ఒక్క fleet ఏర్పాటు చేశారు ఆ fleet system ఇప్పుడు లేకపోవడం బస్‌కార్మికులకు చాలా యిబ్బందిగా వుంది. 20 బస్సులు కలిపి ఒక fleet గా run చేస్తే యజమానులతో వచ్చే సమస్యలపై పరిష్కారానికి ప్రభుత్వానికి బస్ కార్మికులకు కూడా సౌకర్యంగా వుంటుంది. ఈ మధ్య ప్రభుత్వం 5 బస్సులతో fleet ఏర్పాటు చేయవలెనని ఆర్డరు జారీచేసింది. అంటే 5 బస్సులు ఒకటిగా అవాలని కాదు. 2 లేక 3 బస్సులున్న వారిని మిగిలిన బస్సులు రోడ్డును సంపాదించుకోడానికిమాత్రమే అవకాశం యిస్తోంది యీ ఆర్డరు. అది ఎంతమాత్రము లాభదాయకం కాదని నేను చెప్పుతున్నాను. 5 బస్సులతో fleet ఏర్పాటుచేస్తే ఏమాత్రము లాభదాయకంకాదు. కనుక అలాకాకుండా కొంతమందిచేరి 20 బస్‌లను ఉన్నప్పుడే ఒక fleet పద్ధతిలోనడుపుకుంటే వారికి చాలా లాభదాయకంగా ఉంటుంది. 20 బస్‌లు కలిపి ఒక fleet క్రింద run చేస్తే బస్ రవాణా పద్ధతిలోనే కొంత మార్పు రావడానికి అవకాశం ఉంటుందని నేను అనుకుంటున్నాను. Road Trafic Cod లో డ్రైవరు కారును ఏవిధంగా నడపాలో రూల్సు వున్నాయి. ఆదేవిధంగా నేరాల జాబితాకూడ వుంది. ఈ రూల్సులో చాలభాగం ప్రస్తుత పరిస్థితులకు సరిపోవు కనుక మార్చాలి. అంతేకాక యీ రూల్సు తెలియ నవసరం లేకుండానే మంత్రి అవుటకు అభ్యంతరం లేదుకాని డ్రైవరుగా అనర్హుడవుతారు. కాబట్టి రూల్సు మార్చాలి. ఈ drivers కు conductors కు ఉండే కష్టనష్టాలను చెప్తూ ఈ విషయా

లను ప్రభుత్వం దృష్టికి తీసుకువస్తున్నాను. ఈ drivers, conductors R. T. O. అంటే భయపడాలి. Sub-Inspectors అంటే, భయపడాలి. Break Inspector అంటే, భయపడాలి. R. T. O. గారికి side యివ్వకపోతే తంటా, Police Inspector గారి కారుకి side యివ్వకపోతే తంటా. R. T. O. గారి కారుకిగాని. Inspector గారి కారుకిగాని side యివ్వకపోతే conductor licence, driver licence suspend చేయడం జరుగుతోంది. ఆ బస్ నే కొన్ని సందర్భాలల్లో suspend చేయడం జరుగుతోంది. కాబట్టి యిట్టి super-vision లేకుండా చేయాలి. తరువాత First aid ను డ్రైవర్స్, కండక్టర్స్ అందరూ విధిగా నేర్చుకోవాలి అన్నారు. First aid ను నేర్చుకోవాలనే principle కి నేను వ్యతిరేకంకాదు. కాని అట్టి trainingను పొందడానికి అవసరమైన అవకాశం డ్రైవర్సుకు కండక్టర్సుకు యివ్వకపోడాన్నే నేను వ్యతిరేకిస్తున్నాను. ట్రయినింగ్ను పొర్చు అందుకు అవకాశం యజమానులుకాని ప్రభుత్వంకాని, యివ్వడంలేదు. అందుచేతనే నా వ్యతిరేకం. తరువాత ప్రభుత్వ Ambulance కార్లు అనేవి వున్నాయి. ఆ Ambulance కార్లే ఈ రోజులలో సరిగాలేవు. అవి కూడా చాలా ప్రమాదాలకు లోనవుతున్నాయి. అవి Ambulance కార్లు పేరుకుమాత్రమే. ఉదాహరణకు మొన్న నొక Ambulance car సంధ్యాలనుంచి ఇక్కడికి వస్తున్నప్పుడు ప్రమాదానికి గురై ఆ డ్రైవర్, అందులోని పేషెంటుకూడా చనిపోయారు. ఆ పేషెంటు వెంటనే చనిపోయాడు. డ్రైవర్ మాత్రం తరువాత చనిపోవడం జరిగింది. అందుచేత Ambulance లోను First Aid లోను అంత నమ్మకంలేదు. ప్రమాద మేదైనావస్తే సంరక్షించవలసిన Ambulance Van కూడా ప్రమాదానికి గురైనది. Training Course పెట్టడంలో ప్రభుత్వం మోటారు కార్మికుల యిబ్బందిని గమనించలేదు. ప్రతిరోజుకు ఉదయం 6 గం. నుండి సాయంత్రం 7 గంటలు బస్సులుమీద తిరుగుతూ నెలా ఈ training అవగలరు. ఈ training అవడానికి వారి వద్ద డబ్బు ఉండదు. వారు పనిలో ఉండగా ఆ training undergo అవడానికి వీలుండదు. అందుచేత ఈ training విషయంలో బాధ్యత ప్రభుత్వంగాని, బస్సు యజమానులుగాని వహిస్తే బాగానే ఉంటుంది. ఈ విషయమై ప్రభుత్వమో, బస్ యజమానులో బాధ్యత వహించే

Sri M. Veerabhadram] [15th March 1954

లాగ ప్రభుత్వం ఏర్పాటుచేయాలి. దీనికి ప్రస్తుతం వున్న కాలపరిమితి 31-3-1954 వరకు వుంది. దానికి కనీసం. ఒక సం. వరకైనా పొడిగించి ఈలోపుగా డ్రైవర్లు, కండక్టర్లు first aid శిక్షణ పొందేందుకు ఉండవలసిందే, కాని First aid certificate అవసరమైన అవకాశాన్ని ప్రభుత్వం కల్పించాలి లేదా యజమానులు చేసేటట్లు చూడాలి. కాని First Aid Certificate లేనిదే యిప్పుడు కొన్ని licences renewal చేయడానికి వీలులేదంటున్నారు. . అసలు ఇదివరకు licence ఉన్నవాళ్లకు licence renew చేసుకోడానికి rules ను relax చేసి ఇకముందు క్రొత్తగా ఎవరైనా licence కావాలంటే వారికి First aid training అయి, certificate ఉండాలంటే సమంజసంగాను, సబబుగానూ ఉంటుంది. ఇక బస్‌లు over load చేసే విషయంలో owners నే అనాలి కాని బస్ కార్మికులను నిర్బంధించవలసిన అవసరం ఎంతమాత్రంలేదు. బస్ కార్మికులు బస్‌లలో over load చేస్తున్నారంటే, excess fares వసూలు చేస్తున్నారంటే, దానికంతకు బస్ యజమానులే కారణం. బస్ యజమానులు లాభం రావాలనిచెప్పి over load చేయమని excess fares వసూలు చేయమని డ్రైవర్లకు, conductors కు చెప్తూ ఉంటారు. over load చేస్తే Conductor licence, Driver licence కూడా పోలీస్ వాళ్లు hand over చేసుకోవడం జరుగుతోంది. అసలు conductor over load చేస్తే Driver licence కూడా hand over చేసుకోవడం, cancel చేయటం ఎందుకు? బస్‌లనుకూడా, 2, 3 నెలలు తిరగకుండా చేసి, Driver, Conductor ల licence లను నెలలతరబడి suspend లో చేయడం జరుగుతోంది. కొన్ని కొన్ని చోట్ల Driver, Conductor ఇద్దరు ఏకమై overload చేయడం జరుగుతోంది. అది ఎలాంటి సందర్భంలో జరుగుతుందంటే, యజమానులువారికి సరిగా జీతములు యివ్వరు. యివ్వకపోతే వాళ్ళు over load చేయడం, excess fares వసూలు చేసి వాళ్ల బత్తాలు జీతాలు అందులోనుంచి తీసుకొనడం జరుగుతోంది. ఉదహరణకు అనకాపల్లిలో తాకాశిపు అప్పారావు అనే ఆయనకు చెందిన బస్సుల్లో ఇది జరుగుతోంది. తరువాత 3rd form certificate ఉంటేనేకాని driving licence యివ్వనడం జరుగుతోంది. 3rd form చదివితేనేగాని, ఆ certificate వుంటేనేకాని licence లు యివ్వబడవని ఈ మధ్య ఒక G. O. కూడా వచ్చింది. ఇప్పుడు ఉన్న

15th March 1954] [Sri M. Veerabhadram

drivers యొక్క licence లు renew చేయడానికి మాత్రం ఈ rule ను అడ్డురాకుండా జేయాలని చెప్తున్నాను. కొత్తగాయిచ్చే licence కు మాత్రమే ఈ rule వుండేటట్లు చేయాలి.

ఇకపోతే city service లో load చేయకపోతే ప్రయాణీకులకు చాలా inconvenience కలుగుతుంది వాల్తేరులో Andhra University silver jubilee convocation జరిగింది. దానికి చాలామంది జనం వచ్చారు. ఆ జన్నాన్ని city నుంచి కాలేజీకి కాలేజీనుంచి cityకి తీసుకురావాలంటే over load చేయకుండా ఏలా కుదురుతుంది? over load చేసినందుకు 15 రోజులు డ్రైవరు లైసెన్సు సస్పెండు చేయబడింది. city serviceలో over load చేస్తే కొన్నికొన్ని సమయములలో వాళ్లను పట్టుకోకూడదు. మొత్తంమీద ఈ Motor Bus service లో బస్ కార్మికులకు చాలా అన్యాయాలు జరుగుచున్నాయి. ప్రభుత్వం బస్ యజమానుల పక్షమే వహిస్తోంది. ఉదాహరణకు West Godavary District లో బస్ యజమానులకు, కార్మికులకు వచ్చిన తగాదా సందర్భంలో labour officer, జిల్లా కలెక్టర్ ఇచ్చిన తీర్పునుకూడా యజమానులు ఒప్పుకోకపోతే కార్మికులు ఆందోళనచేస్తే అక్కడవాళ్లపై 144 సెక్షన్ కు ఉత్తర్వులు జారీచేశారు. మొన్న West Godavary నుంచి ఒక పెద్దమనిషి వచ్చాడు ఆయన హాస్టల్లో మాతోనే వున్నాడు. మోటారు కార్మికుల తగాదాను గురించి సంజీవరెడ్డిగారికి represent చేశారు. అయితే నాలుగురోజులు West Godavari లో కనపడనందున రహస్యంగా మోటారు కార్మికులను రెచ్చగొడుతున్నాడనిపోలీసులు రిపోర్టు వ్రాసినందున అరెస్టు చేశారు. ఆ జిల్లాలోగల పోలీసు ఆఫీసరు సమర్ధవంతంగా పనిచేయడం లేదు. సమర్థులను పంపాలని అనుకొంటున్నానని సంజీవరెడ్డిగారు చెప్పారు. పంపించారు. క్రొత్తవారిని ఎవరిని పంపించారు అంటే 1947 మొదలు 1951 వరకు ప్రజలపై అనేక రకాలుగా అత్యాచారాలు చేసిన ధామసుగారిని పంపించారు. గ్రామగ్రామానికి S. A. P. వాళ్ళను పంపించి భయంకరమైన పరిస్థితులు కల్గిస్తున్నారు. ఈ రోజు బాధ్యతవహించవలసింది, యజమానుల పక్షం వహించి కార్మికులకు వ్యతిరేకంగావున్న ప్రభుత్వమే. ప్రభుత్వం యజమానుల పక్షంవహించినా, ఒక విషయం మరచిపోవద్దు. తుపాకులవల్ల కార్మికుల ఉద్యమాన్ని అణచలేరని చెబుతున్నాను. ఈ

Sri M. Veerabhadram] [15th March 1954

రోజున West Godavary లో వచ్చిన పరిస్థితులను సరిదిద్దడానికి పూను కోకపోతే రాష్ట్రంలో వుండే మోటారు కార్మికులు అందరూ తమ అసమ్మతిని, West Godavary మోటారు కార్మికులపై తమ సాను భూతిని, నెల్లూరుజిల్లాలోవుండే బస్సు వర్కర్లు ఈ రోజున 1 గంట సాను భూతిసమ్మె చేసిన మాదిరిగానే, తెలియచేస్తారని హెచ్చరికచేస్తూ విర మిస్తున్నాను.

Sri PRAGADA KOTAIAH:— అధ్యక్షా, నేను ప్రధా నంగా ఒకటి, రెండు సూచనలు మాత్రమే చెప్తాను. ముఖ్యంగా బస్సుల నిర్వహించే విషయంలో కొద్దిమంది వ్యక్తులకు 20 బస్సులవరకు ఇవ్వడం అవసరమనే సూచన ఇటీవల చేస్తున్నారు. ఇది సరియైన విధానం కాదని మనవిచేస్తున్నాను. ఈ బస్సుల వ్యాపారంలో మధ్యతరగతి ప్రజలు రావడానికి అవకాశం వుండే విధంగా ప్రభుత్వం తన విధానం రూపొందించుకోవాలి. అయితే సాధారణంగా ఎవరైనా ఈ వ్యాపారం చేసుకోడానికి వేలకొద్ది రూపాయల ధనం వుంటేకాని సాధ్యంకాకుండా వున్నది ప్రభుత్వం అన్నిరంగాల్లో సహకార ఉద్యమాన్ని అభివృద్ధిచేస్తా మని బాహాటంగా చెబుతున్నారు. అలాంటి పరిస్థితుల్లో బస్సుల వ్యాపా రాన్ని సహకార సంఘాలపరం చేయడానికి ఎందుకు ప్రయత్నించ కూడదని ప్రశ్నిస్తున్నాను. ముఖ్యంగా అనేకమంది వెనుకబడినవాళ్ళు అంతా సహకార సంఘాలు ఏర్పరిచి బస్సుల వ్యాపారం చేసుకుందాం అంటే, Transport శాఖవారు route ఏదైనా ఇస్తామన్నారు, అల్లా గయితే register చేస్తామని Co-operative department వాళ్లు అంటారు. ఈ విధానంవల్ల సహకార ఉద్యమాల వ్యాప్తి అవ కాశం లేకుండా పోయింది. అందువల్ల ప్రభుత్వం తన విధానం స్పష్టంగా చెబుతూ అధికారులకు సూచనలుచేస్తే, క్రమక్రమంగా సాధారణమైన ప్రజలు ముందుకురావడానికి అవకాశం వుంటుంది. అపుడు అందులో పని చేసేకార్మికులకు అవసరమైన ప్రయోజనాలు కల్గించడానికి వీలు వుంటుంది. డ్రైవర్లు, కండక్టర్లు, అందరూ సహకారసంఘం అయినపుడు రు 5 లు వాటాధనంకట్టి ఎవరికివారే బాధ్యత వహించడానికి, వ్యవహారం చేయడానికి అవకాశం వున్నది. ప్రభుత్వం ఈ సహకార సంఘాలకు ప్రోత్సాహం ఇవ్వడంలేదు. Ex-servicemen Transport

15th March 1954] [Sri Pragada Kotayya

Co-operative Societies ను ఏర్పాటు చేసారు. అందులో Transport Society వారు traffic board ను approach అయితే మీకు 2, 3 బస్సులు ఇచ్చాము, కదా అంటున్నారు. మొత్తానికి సహకార ఉద్యమం దేశంలోనికి వచ్చింది. Transport Cooperative Societies ఏర్పాటు చేయడం జరిగింది. మొత్తం ఉమ్మడి రాష్ట్రంలో 20 దాకా societies వున్నా ఆంధ్ర రాష్ట్రంలో 2, 3 సొసైటీలే వున్నాయి. గుంటూరులో ఒకటి పనిచేస్తోంది. పెట్టుబడిదారులను క్రమక్రమంగా తొలగించడం మన విధానం అని ఒకవైపు చెబుతూ, మరొకవైపు పెట్టుబడిదారులను కుబేరులనుచేసే విధానం ప్రభుత్వం అవలంబిస్తోంది అని అభిప్రాయపడుతున్నాను. నేను ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో వుండగా ఒక సూచన చేశాను. 400, 500 సభ్యుల వరకు వున్న ఈ societies లోని వారిని పన్నులనుంచి మినహాయించి, సహకార ఉద్యమాన్ని ప్రోత్సహించాలి అనికోరివున్నాను. ఇప్పుడుకూడా అదే సూచనచేస్తూ, వాటిని పన్నుల భారంనుంచి తప్పించాలి అని కోరుతూ విరమిస్తున్నాను.

Sri B. KRISHNAMURTHI RAO :— అధ్యక్షా, మంత్రిగారు చెపుతూ బస్సు యజమానులు ఎక్కువపన్ను కడుతున్నాం అని విజ్ఞాపన చేసారనియు, వారికి చాలా నష్టంవస్తోంది అనియు చెప్పారు. కొన్ని రూట్సు లాభంవస్తాయి, కొన్నిరూట్సు నష్టంరావచ్చు, సమగ్రంగా విచారణచేయించి, ఏదైనా కృషిచేస్తామని చెప్పారు. వారు చెప్పిన మాటలనుబట్టి చూస్తే, కొంతవరకు ఆశాజనకంగా కనిపిస్తోంది. ఇంతకు మునుపు ప్రగడకోటయ్యగారు మాట్లాడినపుడు fleet owners సిద్ధాంతంగురించి చెప్పారు. అది మంచిదికాదని చెప్పారు. ఆ పద్ధతిలో బస్సులు నడిపేవారికి ఏమైనా లాభం రావచ్చునేమో. ఆంధ్రరాష్ట్రంలోను, మద్రాసు రాష్ట్రంలోను 30 సీట్లు వున్న బస్సుపై యజమాని చెల్లించేపన్ను సంవత్సరానికి రు. 4725 లు వున్నది. చెల్లిస్తున్నాడు కూడా. తక్కువగా చెల్లించేది పశ్చిమ బెంగాలులో రు. 141 లు; పంజాబులో రు. 157 లు. బస్సుయజమానులు ఎక్కువగా సంపాదిస్తున్నారు అనే అభిప్రాయం నిశ్చయంగా ప్రభుత్వానికి కలిగియున్నట్లయితే, ఈనాడు మనది లోటుబడ్జెటు కనుక వాళ్ళపై పన్నులు విధించవచ్చును. దీనివల్ల వాళ్ళు over load చేయడం, వాళ్ళపై charge పెట్టడం,

Sri B. Krishnamurthi Rao] [15th March 1954

charge తప్పించుకునేందుకు ఉద్యోగస్థులకు కాస్త కూస్త ముట్టచెప్పి తప్పించుకోడం, ఇవన్నీ తప్పిపోతాయి. కానీ వాళ్ళకు ఎక్కువలాభాలు వస్తున్నాయి అని, సులభమైన వ్యాపారం అని, కాస్త కూర్చుంటె లాభాలు వస్తాయని ప్రభుత్వ దృక్పథంలో వుంటే, ఆ వ్యాపారం మనమే చేస్తే బాగుంటుంది అని నా సలహా. మొత్తంమీద రాష్ట్రం అంతా లెక్కవేస్తే రు.5700 కడతారు- రు.4200పన్ను రూపంలో, రు. 1500 sucharge రూపంలో. లారీవాళ్ళు రు. 1970 లు కడతారు. మొత్తం 2200 బస్సులు వున్నాయి. వాస్తవానికి 20,40,000 వేలు బస్సులవల్ల, లారీలవల్ల 59 లక్షల 10 వేలు రావాలి. కార్లు 2 లక్షల 10 వేల దాకా చెల్లించాలి. ఈ tax అంతా మనకు వస్తోందా? లేదు. Motor Vehicles నుంచి మనకు వచ్చే income చాలా తక్కువగా ఉన్నది. మొత్తంమీద రాష్ట్ర ప్రభుత్వానికి 8 వేలచిల్లర, కేంద్రప్రభుత్వానికి 6 వేల చిల్లర, మొత్తం రు. 14930 లు పైగా మనమే వసూలుచేస్తున్నాము. ప్యాసింజర్సుపై కూడా ఈమధ్య రేట్లు పెంచారు. ప్రభుత్వానికి చెప్పేది ఏమంటే, నిజంగా బస్సు వాళ్లు లాభం సంపాదిస్తే అది జాతీయం చేయండి. వారికి నష్టంవస్తోంది అంటే, ఎవరో expert ను వేసి విచారణ చేయిస్తాము అన్నారు. దీనికి నేను వ్యతిరేకిస్తున్నాను. శాసనసభలో వున్న మనం ఏవిధానంఅయినా తయారు చేయడానికి బాధ్యులుగా ఉండాలి. ఎక్కడో ఉన్న వానిని తెచ్చి ఆయన చేత విచారణచేయించితే, శాసనసభ్యులకు సంబంధములేని కార్యక్రమం అనుసరించాల్సి వస్తుంది. ఆ నియమించే వాళ్ళెవరైనా మోటారు పరిశ్రమలో అనుభవంవున్న వాళ్ళు, నిష్పక్షపాతంగా ఉన్న వాళ్ళుగా నిర్ణయించాలి అని కోరుతున్నాను.

*Sri S. NARAYANAPPA:— అధ్యక్షా, ఈ మోటారు పన్నుల విషయమై బస్సు యజమానులు ప్రభుత్వానికి, శాసనసభ్యులకు తమ కష్టములనుగురించి విజ్ఞప్తులు పంపుతూ, ఈ పన్నులభారాన్ని భరించలేము అని అంటున్నారు. కాపట్టి ఈ పన్ను భారాన్ని కొంత వరకు తగ్గించగల యోచన చేయవలసియున్నది. బస్సు యజమానులు చాలామంది ఆర్థికముగా దెబ్బతిన్నసంగతి వాస్తవమే. ప్రయాణీకులుకూడా ఆర్థికమాంద్యమువల్ల ప్రయాణాలు మానుకున్నారు.

ఎంతో ఎక్కువ అవసరం ఉంటేనే ప్రయాణం చేస్తారు. సాధారణ పరిస్థితులలో ప్రయాణాలు మానుకున్నారు. కలెక్షన్లు తగ్గినవి. పన్నుల భారము తగ్గలేదు. కాని ఈ పన్నులను తగ్గించడానికి ప్రభుత్వం పూనుకుంటే, మన బడ్జెటు తారుమారు కావచ్చునని సంకోచించవచ్చు. అభివృద్ధి, మన ఆర్థిక ప్రణాళికలు, దెబ్బతినవచ్చును. ఈ సందర్భంలో నేను ప్రభుత్వానికి ఒక విజ్ఞప్తి చేస్తున్నాను. మోటారు యజమానులందరకు ఒకేమాదిరి లాభములు ఉండవు. జిల్లాలలో కొన్ని అక్కడక్కడ కొన్నికొన్ని మంచి బస్సు రూటులు ఉంటవి. కలక్షను తక్కువగా వచ్చే బస్సు రూట్సు ఉన్నవి. అందువల్ల ప్రభుత్వం అజమాయిషి చేయించి, ఒక్కొక్క జిల్లానుకాని లేక ఒక్కొక్క తాలూకాను పేసుకొని, ఆయా ప్రాంతములలో కొన్ని రూట్ల ఆదాయమును అనుసరించవచ్చును. కలెక్షన్ల పరిశీలన జరిగిన తరువాత పన్నుల తగ్గింపు ఏర్పాటు చెయ్యవచ్చును. అప్పుడు బస్సు యజమానులు చెప్పేదానిలో సత్యం ఉన్నదో లేదో తెలుసుకోవచ్చును. కనీసము యీ పద్ధతి అమలు జరిపే బస్సు యజమానులకు న్యాయంజరుగునని కోరుచున్నాను. ఇదివరలో మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పుడు బస్సురూట్లను వేలంపాట పెడితే బాగుండునని సలహాలు కొంతమంది యిచ్చినారు. మన ప్రభుత్వం ఆ పద్ధతిని అమలుపెడితే బాగుండునేమో పరిశీలించవలయునని విజ్ఞప్తి చేస్తున్నాను. సహకారసంఘాల రూట్లను మంజూరుచేయు పద్ధతే బాగుండును. అయితే, యిప్పుడు పనిచేయుచున్న మోటారు సహకార సంఘాలుకూడా చాలామట్టుకు లిక్విడేషను అగుచున్నవి. ప్రగడ కోటయ్యగారు చెప్పినట్లు, ఒకటి, రెండు సంఘాలు రాష్ట్రములో ఉంటే ఉండవచ్చును. వాటికి సహాయం చెయ్యడానికి ప్రభుత్వం వెనుకాడదని భావించుతాను.

తరువాత డ్రైవర్లు, కండక్టర్లు ఓవరులోడ్డు కేసులకు లైసెన్సులు రద్దుచేయడంవల్ల వారు చాలా ఇబ్బందులు పడుతున్నారు. ఒకటి రెండు సంవత్సరములు వరకు లైసెన్సులు సస్పెండుచేసిన సంగతులు నాకు తెలుసును. అప్పుడు డ్రయివర్లు, కండక్టర్లు రైతులవద్దకువెళ్ళి ధాన్యం భిక్షమెత్తుకొని జీవనము చేసినసంగతి నాకు తెలుసును. డ్రైవరు, కండక్టర్లు తప్పుచేస్తే వారి కుటుంబాలకు కష్టం కల్గించడం న్యాయంకాదు.

Sri S. Narayanappa] [15th March 1954

జుల్మానాలు వెయ్యవచ్చును. ఈ పద్ధతి అమలుజరుగునట్లు ప్రభుత్వంవారు ఏర్పాటు చేయవలయును.

తరువాత డ్రైవర్లు, కండక్టర్లు First Aid ప్యాసు కావాలని నిబంధన ఉంది. దద్దుచేస్తామని మంత్రిగారు అన్నారు. ఈ విషయంలో ఒక మనవి చేస్తున్నాను. ఫస్టుఎయిడు సర్టిఫికేటు పొందుపద్ధతి అమలు పరచిన బాధలేదు, గాని అందుకు 8 రూపాయల రుసుము చెల్లించే పద్ధతి మాన్పించవలయును.

ఇంకొక విషయము. ఈ మోటారుబండ్లకు వెనుకభాగమున రెండు టైర్లు చక్రములు వున్నందున రోడ్లు చాల పాడయిపోయినవని యింజనీర్లు తలపోయుచున్నారు. ఈవిషయంలో తగిన పరిశీలన చేయించి తగినచర్యలు తీసికొన్నగాని రోడ్లపై వెచ్చించు ద్రవ్యము నిరుపయోగము. రోడ్లు బాగులేవు అంటే ఇంజనీయర్లు తప్పును మోటారు బండ్లమీద వేయుచున్నారు. కాబట్టి సింగులు టైరు బండ్లను ప్రవేశపెట్టు ప్రయత్నము అమలుజరుపవలెనని మనవిచేస్తున్నాను.

Sri P. PUNDARIKAKSHACHARYULU :— అధ్యక్షా, ప్రభుత్వం ఈ మోటారు బస్సు ప్యాసింజర్ల సర్‌చార్జి ప్యాసు అయిన తరువాత, ఏమోస్తరుగా పనిచేస్తున్నది, ప్రభుత్వానికి లాభము వస్తున్నదా, ఆదాయము ఎక్కువయిందా లేక తగ్గిందా అన్న వివరములు మంత్రిగారు చెప్పలేదు. నేను మనవిచేసేది ఏమిటంటే ఆక్టులు ప్యాసు చేసిన తరువాత రిసల్ట్సు ఏవిధముగా ఉన్నవీ చూడడం ప్రభుత్వం విధి. ఆవిషయంలో క్రిష్ణారావుగారు చెప్పినట్లు 200 బస్సులు, 3000 లారీలు పనిచేస్తున్నప్పుడు సుమారు 20 కోట్ల రూపాయలు అదాయము రావలసియుండును. కాని బడ్జటులో 1 కోటి 43 లక్షలు మాత్రం చూపించేరు. దానినిబట్టి చూస్తే కొన్ని బస్సులు, లారీలు ఆగిపోయినట్లు తెలుస్తున్నది. యజమానుల పరిస్థితులను తెలుసుకొని మంత్రిగారు ఈ సర్‌చార్జి విత్‌డ్రా చేస్తే బాగుండును.

ఇకపోతే బస్సురూట్లను ఆక్షనుచేస్తే బాగుండునని నా మనవి. మద్రాసు శాసనసభలో మాపార్టీ ఉపనాయకుడుగా పనిచేసిన తిమ్మారెడ్డిగారు చెప్పేఉన్నారు, కొన్ని రూట్లలో లాభమువస్తుంది, కొన్నిం

టిలో రాదు కాబట్టి వేలంపద్ధతివల్ల ప్రభుత్వానికి లాభమురావచ్చును. vested interests, మాత్రం ఇప్పుడు లాభములు పొందుతున్నారు.

[At this stage Mr. Speaker resumed the Chair]

Sri G. NAGABHUSHANAM:—Sir, Just like exports and imports, the then tax on motor vehicles affected a very good source of income. As a member of the composite Madras State, I was one of those who advocated for the increased tax on motor vehicles. But now conditions have changed thoroughly. Most of the proprietors, so far as, I know are undergoing great hardships and it is becoming impossible for them to maintain the regular services. Particularly in my Anantapur district, many of the vehicles often go empty. No doubt, there are certain routes which always carry a large number of passengers and which are profitable, but there are certain routes where most of the passenger vehicles go empty, because the purchasing power of the people has gone down and as a result of it they are not moving about as before. Besides, there is a slump, not only in India, but throughout the world. Therefore, on account of the present economic slump and on account of accute unemployment, it has affected this business of motor vehicles. The present condition of the proprietors of motor vehicles is really pitiable. I would request the Government to take note of this and see that the proprietors get some relief. I congratulate the Hon. Sri N. Sanjeeva Reddi that he has decided to take steps to mitigate the hard ships by appointing of a committee to investigate and find out how far and to what extent the tax could be reduced to afford reasonable relief. The suggestion made by the Hon. Deputy Chief Minister is very reasonable and acceptable in the present existing circumstances.

It is a very good suggestion to give training to the drivers and conductors in firstaid and nobody can oppose

Sri G. Nagabhushanam] [15th March 1954

it. But the Government have not provided the means for these poor people to undergo the necessary tarining. The Government must come forward with a practical scheme by which the poor people can undergo this first-aid training. It is really beneficial to them during times of emergency. I would therefore guggest that the Government should first provide means before they think of first-aid training to be given to the drivers and conductors.

With these words, Sir, I support the Demand moved by the Hon. Sri N. Sanjeeva Reddi.

The Hon. Sri N. SANJEEVA REDDI:— అధ్యక్షా, మోటారు కార్మికుల గురించి మోటారు యజమానులగురించి వీరభద్రం గారు విశాలంగా చెప్పారు. కొన్ని విషయాలకు కనీసం జవాబుచెప్పవలసి యున్నది. వీరు bus వాండ్లకు నష్టము వస్తుందని sympathise చేశారు. అందుకు వారిని నేను అభినందిస్తున్నాను, ఏదో పెద్దమార్పు వచ్చినట్టుంది. Sympathise చేయడము మంచిదే. Surcharge వేయడము వల్ల passengers మీాద పడుతుందని చెప్పినారు. 20 bus లు పెట్టడమనేది try చేశారు. మూడునుంచి 5కు వచ్చింది. 20 బస్సులు పెట్టడము మంచిదే. వాండ్లను బలవంతముగా చేర్చుకోవాలి. యిష్టములేని రెండు మూడు బస్సులను కలిపివేస్తే వాండ్లు 4 రోజులకే దెబ్బలాడుకుంటారు. కోర్టుకుపోతారు. Advantage ఏమిటో తెలియదు. కాని co-operative basis పైన పనిచేస్తే ప్రోత్సాహము యివ్వాలని కోటయ్య గారు చెప్పారు. నిజమే. అనంతపురంలో యీలాగే పెట్టి insolvent అయినారు47-48 రోజులు పెట్టడము క్రొత్త బస్సులు అమ్ముకోవడము జరిగింది. వాండ్లు co-operative basis పై నడుపుకుంటామంటె తప్పకుండా దానిని ప్రోత్సహించవలసి వుంటుంది. యిక First-aid ను గురించి వీరభద్రంగారు చెప్పారు. Drivers, Conductors First-Aid నేర్చుకోవడము మంచిది. ఇకమీాద క్రొత్తగా ప్రవేశించే Drivers, Conductors నేర్చుకోవాలని, అట్లు నేర్చుకుంటే మంచిదనే ఆలోచిస్తున్నాను. Drivers, Conductors, R. T. Os., Motors Ins-

pectors, D.S.Ps, checking చేయడమువల్ల బాధపడుతున్నారని అన్నారు. నిన్ననే నేను ఆత్మకూరు వెళ్ళాను. నా car ను చూడగానే ఎదురువస్తున్న బస్సును ఆపి అందరు ఒంటికి కూర్చున్నారు. కనీసము 30 మంది దిగివుంటారు. యీ 30 మంది దిగినా బస్సు full గానే వుంది. ఎంతమంది officers ఉన్నవారు మామూలు పుచ్చుకొనే వుంటారు. ఈ ముగ్గురు officers కనుక్కోవడము చాల కష్టము.

Sri VAVILALA GOPALAKRISHNAIAH:— అటు వంటివారిని allow చేయకుంటే చాలు.

The Hon. Sri N. SANJEEVA REDDI:— ఇప్పుడు punishments చాల severe గా వున్నాయన్నారు. కొన్ని routes కొట్టివేస్తున్నారనికూడ భద్రంగారు చెప్పారు. కాని పదిసార్లు punishment యిచ్చినా మారనివాండ్లను ఏమి చెయ్యాలి? ఒకరికి 8 punishments యిచ్చారు. అయినా January లో 2-3 దఫాలు ఐంది. యీ మాదిరి repeated గా చేస్తున్నారు. ఒక్క కేసు మాత్రము నాకు appeal కు వచ్చింది. ఒక్కసారితప్పుచేస్తే permit cancel చేయడము జరుగదు. 10 సార్లు punishment యిచ్చినాకూడ మరి చేస్తే permit cancel చెయకుండ ఏమాత్రము దయచూపడము మంచిదికాదు. బస్సులకు suspen చేస్తే చాల యిబ్బంది కలదు. యే 15 రోజులో buses ను suspend చేస్తే, ఆ 15 రోజులు వాండ్లు యింట్లో కూర్చుంటారు. కాని passengers కు చాల యిబ్బంది కలుగుతుంది. కొందరు ఉద్యోగులు ఒక సలహా చెప్పారు. Suspend చేయకుండ heavy fines వేస్తే సరిపోతుందన్నారు.

Passengers కు యిబ్బందులు కలుగకుండా suspend చెయ్యాలి. వరుసగా bus ను 15 రోజులు, suspend చేస్తే పాపము ప్రజలకు చాలా యిబ్బందులు కలుగజేసినట్లు అవుతుంది. 30 మైళ్ళు 40 మైళ్ళ నుండి, తాలూకా centres కు రావలెనంటే. Bus లేకపోతే చాలా అవస్థలు పడతారు.

Sri N. Sanjeeva Reddi] [15th March 1954

3rd form qualificationకూడా లేకుండా చెయ్యమంటున్నారు. ఎట్లా చెయ్యాలో తెలియటం లేదు. First-aidసౌకర్యాలు చెయ్యమంటున్నారు. అంతమాత్రమన్నా qualification లేకపోతే ఎట్లా? మంత్రులకు, ఏ qualifications లేకపోయినా ఫరవాలేదు. కావాలని చెప్పబడలేదు. కాని యీ బస్ కండక్టర్లకు డ్రైవర్లకు అంతమాత్రమైనా qualification లేక first aid పెట్టి ఏమి లాభము. ఈ వృత్తిలో ప్రమోషన్సు వుంటాయి. మొదలు "క్లీనర్" (cleaner) గా జేరినవాడు క్రమంగా conductor గాను, ఆ తరువాత, driver గాను, ప్రమోషన్ అగుటకు అవకాశాలున్నాయి. Backward districtsలోbuses వారు, చాల్గా యిబ్బందులు పడుతున్నా మంటున్నారు. ఒకటి, రెండు bus లను వేయటం జరిగితే బాగుంటుంది.

Bus ఆపరేటర్లు కొన్నిచోట్ల నష్టపడుతున్నారని చెప్పారు. Passengers తక్కువగా వున్నచోట్ల bus వారు నష్టపడటం, నాకు తెలుస్తూనే వున్నది. వారికి ఏవిధంగా relief యివ్వాలో ఆలోచిస్తున్నాను. నేను యింకా బాగా పరిశీలనచేసి ఏమైనా వీలు వుంటుందేమో, చూస్తాను. నష్టం వస్తున్న bus వారికి ఏరకంగా relief యివ్వడానికి వీలుంటుందో ఆలోచించిగాని చేయలేను. కాబట్టి యీ demand ను ఏకగ్రీవంగా pass చేయవలసిందని, కోరుతున్నాను. First aid course విషయంలో యికనుండి వచ్చేవారికి వుండేటట్లున్నా పాత కండక్టర్ల విషయంలో వారు మామూలుగానే వుండవచ్చునని చెప్పాము.

Mr. SPEAKER:—The question is:

"That thg allotment of Rs. 5,08,600 under Demand VI—Motor Vehicles Acts, be reduced by Rs. 100."

The motion was lost.

Mr. SPEAKER:—The question is:

"That the Government be granted a sun not exceeding Rr. 5,08,600 under Demand VI—Motor Vehicles Acts."

The motion was carried, and the grant was made.

15th March 1954]

DEMAND XXIV - CIVIL WORKS - WORKS.

The Hon. Sri N. SANJEEVA REDDI:—Mr. Speaker, on the recommendation of the Governor, of I beg to move:

"That the Government be granted a sum not exceeding Rs. 2,92,17,100 under Demand XXIV - Civil Works - Works."

మొత్తము 292 లక్షలలో 256 లక్షలు ఒక రోడ్లకుమాత్రమే ఖర్చు పెట్టుతున్నాము. ఇంకా demand వుంది. అందులో buildings వస్తవి. కాబట్టి, మిగతా మొత్తం buildings ది అవుతుంది. రాష్ట్ర ప్రభుత్వము రోడ్లకు ఖర్చు పెట్టుతూ, మొట్టమొదట National.Highways, జిల్లాబోర్డు రోడ్లు అని వేరుగా చేయబడ్డవి. కాబట్టి, యీ మొత్తం రాష్ట్రప్రభుత్వం నిర్ణయించిన రోడ్లకుమాత్రమే ఖర్చుపెట్టబడుతుంది. ప్రత్యేకంగా జిల్లాలలోని roads ను 5 భాగాలుగా విభజించవలసి యున్నది. Major transport Roads అన్ని జిల్లా బోర్డులు చూస్తాయి. రాష్ట్రములోని 14266 మైళ్ళ రోడ్లలో 916 మైళ్ళు National Highways క్రింద వున్నవి. 541 మైళ్ళు రాష్ట్ర ప్రభుత్వం చేస్తుంది. 779 మైళ్లు జిల్లాబోర్డులు పరిశీలన చేస్తున్నవి. ఈ రోడ్ల మొత్తములో 5641 మైళ్ళకు మాత్రమే ఖర్చుపెట్టుతున్నాము. ఇక యీ రోడ్లలో మిగిలినవి మ్యునిసిపాలిటీవారు 20 వేల జనాభాగల పెద్దపట్టణముల వారు చూస్తారు. వీరికి ఖర్చులు అఖిలభారత ప్రభుత్వం వారు యివ్వవలసియున్నది. కాని, వారు యివ్వడానికి అంగీకరించలేదు. అదొక బాధ్యత మనమీదపడింది.

జిల్లాబోర్డుల స్వాధీనములో ఉన్నటువంటి రోడ్లలో చాలా భాగము ప్రభుత్వం తీసుకోవాలని 10 జిల్లాలనుండివచ్చిన శాసనసభ్యులు కోరుతున్నారు. ప్రభుత్వం తీసుకుంటే, ఆ roads బాగుపడతాయని, వారి అభిప్రాయము. ఇప్పటి పరిస్థితులలో ప్రభుత్వం వాటిని స్వాధీనము చేసుకుంటే కోటిరూపాయిలు ఖర్చుపెట్టవలసి వస్తుంది. ఈ రోడ్లను బాగుచేయాలనే ఉద్దేశ్యంతోనే, జిల్లాబోర్డు స్వాధీన

Sri N. Sanjeeva Reddi] [15th March 1954

ములోవున్న కొన్ని రోడ్లను మునిసిపాలిటీలో వున్నకొన్ని రోడ్లను 30 మైళ్ళకు మించనివాటిని స్వాధీనము చేసుకుంటాము. మిగిలినవి జిల్లాబోర్డులకు వదలిపెట్టుతాము. 29 మైళ్ళ, 6 ఫర్లాంగుల రోడ్డును, యీ సంవత్సరం జిల్లాబోర్డునుండి ప్రభుత్వం తీసుకుంటుంది. దానికి కొంతడబ్బు ఖర్చుపెట్టుతుంది. ఇప్పుడు జిల్లాబోర్డులు రద్దయినవి. కాబట్టి ప్రభుత్వమే యికముందు యీ roads ను నిర్వహింపవలసి యున్నది. ఇపుడు అవుతున్న ఖర్చులు, ఈ demand ఖర్చులు major roads repairs కొరకే ఖర్చుఅవుతుంది. ఇదివరకు roads బాగావుండేవి. అప్పుడు ట్రాఫీక్ చాలా తక్కువగా వుండేది. అందు వల్ల రోడ్లకు repairs అంతగా ఉండేదిగాదు. ఇప్పుడు traffic చాలా విపరీతముగా పెరిగిపోయింది. ఎక్కువగాడబ్బు రోడ్ల repairs కు ఖర్చు పెట్టవలసివస్తున్నది. ఈ రోడ్లకు పూర్వం ఎంత ఖర్చు పెట్టుతున్నామో, యిప్పుడు అంతే ఖర్చుపెట్టుతున్నాము. ఈ మొత్తమువల్ల సంతృప్తి కరమైన పనులు చేయటం, చాలా కష్టముగా వుంటుంది. ఐనా ఇప్పట్లో యింతకుమించి ఖర్చుపెట్టడము చాలా కష్టము. సాధ్యము గాని విషయంకూడ. ఎక్కువగా యీరోడ్లు, యీ ఖర్చుతో బాగు పడే అవకాశం లేదు. ఇంతకన్న ఎక్కువ ఖర్చుపెట్టలేము.

రానున్న సంవత్సరము రోడ్ల విషయములో ఎక్కువ మొత్తం ఖర్చుపెట్టే దానినిగురించి, ఆలోచించడానికి ప్రయత్నింపగలము. కాబట్టి రోడ్ల విషయములో, ఈ 256 లక్షల demand ను, (బిల్డింగులు మొత్తముగాక) sanction చేయవలసినదిగా ప్రార్థిస్తున్నాను. ఇంకా చెప్పవలసినది ఏమైనా వుంటే, తరువాత చెప్పుతాను.

Mr. SPEAKER :— The motion is:

"That the Government be granted a sum not exceeding Rs. 2,92,17,100 unber Demand XXIV - Civil Works - Works."

I am selecting. the cut motion of Sri P. Pundarikakshacharyulu. He may formally move his motion.

Sri P. PUNDARIKAKSHACHARYULU:— Mr. Speaker, Sir, I beg to move :

15th March 1954] [Sri P. Pundarikaskacharyulu

"To reduce the allotment of Rs. 2,92,17,100 under Demand XXIV—Civil Works — Works, by Rs. 100".

Mr. SPEAKER:—The other cut motions also are deemed to have been moved. The main motion and the cut motion are now before the House for discussion.

Sri P. RAMA RAO:—అధ్యక్షా, ఈ civil works క్రింద ప్రధానంగా రోడ్ల సౌకర్యముల కొరకు ఖర్చుపెట్టబడిందని చెప్పడం జరిగింది. ఈ civil works క్రింద మూడుపద్దులున్నాయి. ఒకటి Capital out lay అని, తరువాత administration ఖర్చులు అని, ఇంకొకటి revenue కాతాలో ఖర్చుపెట్ట బడేటటువంటిది. ఈ మూడింటిలోని, రోడ్లు మినహాయించి, మిగతా పద్దులు చూచినట్లయితే administration ఖర్చు చాలా ఉంటుందన్న మాట. ఇందులో గవర్నరు గారికి అనవసరమైన ఖర్చుపెట్టడం జరుగుతున్నదని ఇదివరకే చెప్పడం జరిగింది. మళ్లీ ఈ పద్ధతులలోకూడ గవర్నరుగారి Guest House కు గాను 5 లక్షలపై చిలుకు ఈ బడ్జెటులో చూపించడం జరిగింది ఇంకా అనేకరకాలుగా, బంగళాలు repairs కు గాను మరితర పనులకుగాను, గవర్నరుగారికి ఖర్చుపెట్టడం జరుగుచున్నది. అన్ని పద్దులు చూచినట్లయితే, ఈ 5 లక్షలు, 30 వేలే కాకుండా, ఇంకొక పద్దుక్రింద లక్ష, 60 వేలు ఖర్చు చూపించారు. అనగా civil works మూడు పద్దులుకలిపి, 6 లక్షలపై చిలుకు గవర్నరుగారి ఖర్చు ఉంటుంది. ఈ విధముగా ప్రజల డబ్బును అనేక రకాలుగా దుర్వినియోగం చేయుడం జరుగుచున్నది ఈ వేళ గవర్నరు Guest House లేకపోయినందున మన ప్రభుత్వము నడువదా? తప్పక నడుస్తుంది. అటువంటి ప్రమాదమేమి లేదు. ఆలాగే, పోలీసుశాఖ ఖర్చు 2 కోట్లు 62 లక్షలు పై చిలుకు కాక, buildings కట్టడానికి 4 లక్షలపై చిలుకున్నూ కన్పిస్తున్నది. ఈ వేళ ఈ పోలీసుశాఖకు buildings మీాద ఖర్చుపెట్టకపోయినట్లయిన ప్రభుత్వము నడువదా అంటే తప్పక నడుస్తుంది. 'అటువంటి ప్రమాదమేమి లేదు. ప్రజలడబ్బు ఈ విధంగా అనవసరంగా ఖర్చుపెట్టబడుచున్నదిగాని, నిజంగా ప్రజల ప్రధాన అవసరాలగురించి ఎంతవరకు ఖర్చుపెట్టబడుచున్నదని చూచినట్లయితే చాలా విచారకరంగా ఉంటుంది. ఉదాహరణకు, మా తాలూకాలో, తిరుపూరులో ఒక పశువుల ఆస్పత్రిఉన్నది.

Sri P. Rama Rao] [15th March 1954

అది వైద్య సహాయంకొరకు వచ్చే రోగుల ఉపయోగార్థమై యెవరో ధర్మాత్ముడు ధర్మసత్రం కట్టించినాడు. కాని ప్రభుత్వం ఆ సత్రములో పశుల హాస్పటలు పెట్టినారు. దానివలన రోగులకు యిబ్బంది జరుగుతున్నది. కాని పశువుల ఆసుపత్రికి ఇక ఏలాటి ప్రయత్నంలేదు. పశువులకు బయటనే వైద్యము చేస్తూయుంటారు. ఆ పశువులు అట్లాగే ఎండలో 2, 3 రోజులు ఉండవలసి యుంటుంది. బిల్డింగు లేకపోవుట వలన చాలా యిబ్బంది జరుగుతున్నది. ఈ విధముగా ప్రజల అవసరాలు వెనుకబడుతూ ఉన్నాయి.

ఈవేళ రోడ్ల పరిస్థితి చూచినట్లయితే, వాటి దుస్థితి చెప్పవలసిన అవసరములేదు. మన రాష్ట్రములో, రాష్ట్రప్రభుత్వముక్రింద దాదాపు 5 వేలమైళ్ళకు పైగా రోడ్లు ఉన్నదని చెప్పడం జరుగుచున్నది. కాని ఈ రోడ్లనుగురించి ఆలోచించేటప్పుడు ప్రజల అవసరాలను ఏమైనా దృష్టిలో ఉంచుకుంటున్నదా? లేదు. ప్రజావసరాలను చూడకుండా ఎక్కడో వారికి కావలసిన చోట సిమెంటురోడ్లు వేయుటకు ఈ డబ్బుఅంతా వినియోగించడం జరుగుతున్నది. ఉదాహరణకు తిరువూరు బందరు రోడ్డుమీద ఒకచోట సిమెంటు కాంక్రీంటు వేయుటకు బడ్జటులో పద్దుచూపించినారు. కాని అదేరోడ్డుమీద మా తాలూకాలో దాదాపు 68 మైలులో రేపూడివద్ద మూడు సంవత్సరాల క్రిందట 1951 జూన్ నెలలో ఒక వంతెన కూలిపోయినది. యింతవరకు దానిని తిరిగి కట్టించలేదు ఆ వంతెనకు దాదాపు 10 వేలు ఖర్చు అవుతుంది. ఎస్టిమేట్లు తయారుచేసి పంపినారు గాని యింతవరకు ప్యాసులేదు. బడ్జెట్టులో యెక్కడా దానికి ఖర్చుచూపెట్టులేదు. అది యెప్పటికి అవనున్నదో తెలియదు కాని, సిమెంటు రోడ్లకని బడ్జెటులో allotment చూపించడం జరుగుతున్నది. వంతెన కూలిపోవుటవలన, బస్సులు లారీలు, బండ్లు యెన్నో యిబ్బందులు పడవలసి వస్తున్నది. ప్రజలయొక్క యీ యిబ్బందులను గుర్తించి వాటిని నెరవేర్చుటకు ప్రభుత్వం ముందుగా ప్లానుకోవాలి. క్రిష్ణాజిల్లాలో తిరువూరు తాలూకా చాలా వెనుకబడిన ప్రాంతము. Communications చాలా తక్కువ. తిరువూరునుండి విస్సన్నపేట వెళ్ళవలెనంటే 25 మైళ్ళు తిరిగి పోవాలి. లక్ష్మీపురము, విస్సన్నపేటకు direct గా 15 మైళ్ళు. ఆ రోడ్డువేయడానికి 1913 సంవత్సరములో

15th March 1954] [Sri P. Rama Rao

ప్రారంభించినారు. ఇంతవరకు దానిని పూర్తి చేయలేదు. యింకా రెండు మైళ్లు వేయాలి. ఇప్పటికి 40 సంవత్సరముల క్రిందట ప్రారంభించి నటువంటి రోడ్డును పూర్తి చేయలేదంటే, ప్రభుత్వము రోడ్ల విషయములో ఎంత శ్రద్ధ వహిస్తున్నదో అర్థమవుతుంది. రాయలసీమలో కరువు ప్రాంతాలలో అనేకచోట్ల రోడ్లు ప్రారంభించడం జరిగింది. అవన్నీ పూర్తికాక అట్లే నిలిచిపోయినాయని మిత్రులు చెప్పుచున్నారు. అది నిజమేనని భావించుచున్నాను ఎందుకంటే, మా తాలూకాలోకూడ కరువు వస్తుంటుంది. ఆ కరువు ప్రాంతాలలో యిటువంటి తాత్కాలిక పనులు ప్రారంభించుతారు. మా తాలూకాలో 1941 సంవత్సరములో కరువు వచ్చినప్పుడు పోలవరము, బుసన్నపేట, రోడ్డుకు కంకరతోలేరు; అప్పుడుతోలిన కంకర గుట్టలు ఆలాగె ఉండిపోయినవి. యింతవరకు దానిని పూర్తిచేయలేదు. ఈవిధంగా రోడ్డుపనులు ప్రారంభించడం, పోసిన కంకరగుట్టలు పోసినచోటనే, కొట్టినరాళ్లు కొట్టినచోట్లనే ఉండిపోవడం జరుగుచున్నది. రాయలసీమ కరువుప్రాంతాలలోగూడ ఈ రోడ్ల పరిస్థితి అదేవిధముగా ఉంటుంది. అనేకచోట్ల రోడ్డుపనులలో కంట్రాక్టర్లకు డబ్బు సకాలంలో ఇవ్వకపోవడంవల్ల వారు యీ పనులను ముగించలేక పోవడం జరుగుతుంది. తరువాత కరువుప్రాంతాలలో పనిచేసిన వారికి యింతవరకు డబ్బు యివ్వలేదని తెలుస్తుంది. కొంతమందిని కంట్రాక్టర్లను చూస్తాము పోటీలమీద పోటీలుపడి చాలా తక్కువ ఎస్టిమేట్లకు టెండర్లుపెట్టటం 1 రూపాయ పనికి ఎనిమిది అణాలు, 9 అణాలు ఆ విధంముగా తక్కువ మొత్తమునకు టెండర్లు పెట్టితే, ఆ విధంగా చాలా తక్కువ మొత్తమునకు వచ్చినటువంటి కంట్రాక్టర్లను నియమిస్తారు అప్పుడు ఆ కంట్రాక్టర్లు సహజముగా చౌక కూలీలకోసరము ఎదురు చూస్తూ యుంటారు. అందుచేత సంపూర్తి చేయరు. ఈ విధముగా 3 సంవత్సరాలు వారికి గిట్టే కూలీలు దొరకక ఆపని పూర్తిచేయకుండా పోయినవారుకూడా యున్నారు. ఈ మాదిరి మూడు సంవత్సరాలకు పూర్తి కానటువంటి పనులు మా తాలూకాలో చాలా ఉన్నాయి. ప్రభుత్వము తక్కువ టెండరు కంట్రాక్టర్లను ఆలోచించుతుందే గాని వారు దానిని పూర్తిచేయకపోతే తగిన చర్యలు తీసుకోవడం లేదు. ఆ విధముగా వారిని వొత్తిడి చేయనంతకాలము కంట్రాక్టరు తక్కువడబ్బు తీసుకునే కూలీలకొరకు ఎదురుచూస్తూ, అటువంటికూలీలు దొరక

Sri P. Rama Rao] [15th March 1954

సంతకాలం పనులు పూర్తిచేయకుండా నిలపడం జరుగుతుంది. ఈ విధముగా కొంతమంది కంట్రాక్టర్లు తక్కువ టెండర్లుపెట్టడం, అటువంటి వారిని నియమించడం, వారుపనులు పూర్తిచేయకపోవడం, దాని వలన ప్రజలు బాధపడడం జరుగుతున్నది. అందుచేత ప్రభుత్వము రోడ్లువేసే విషయములో, ఈ పనులను కంట్రాక్టర్లకు ఇచ్చేటప్పుడు, ఆ పనులు నిర్ణీతకాలములో సక్రమముగా పూర్తిచేసేటట్లు చూడవలసి యుంటుంది. ఇప్పుడు రోడ్లు మరమ్మతులు ఏమాత్రం సరిగా జరగడం లేదు. వాటి పరిస్థితి చాలా అధ్వాన్నంగా ఉన్నది. ఒక రోడ్డులో ఒక నెలక్రిందట కంకరవేస్తే, ఇప్పుడు ఆ రోడ్డుమీద కంకరంతా లేచిపోయినది; రోడ్లు మరమ్మతులు యింత సక్రమంగా యున్నది. నిరుడు సంవత్సరము ఈ రోడ్డు మరమ్మతులనుగురించి ఓవర్సీరునుఅడిగితే, "మమ్ములను ఏమి చేయమంటారు. ఇచ్చిన ఆ allotment అలాఉన్నది" అన్నారు. కంట్రాక్టర్లను అడిగితే ప్రభుత్వము మమ్ములను అవిధంగానే చేయమన్నది, అంతమట్టుకేనని చెప్పుతారు. అధికారుల సలహాప్రకారం చేసినాము. మా బాధ్యత లేదంటారు. విజయవాడనుంచి తిరువూరు వచ్చేరోడ్డు 50 మైళ్లు చాలా అధ్వాన్నంగా ఉంటుంది. బస్సులలో కూర్చొనడానికికూడ సాధ్యంకాదు. యిక రోగులు గర్భిణీ స్త్రీలు ప్రయాణం చేయవలసివస్తే అవస్థ చెప్పనలవికాదు. రోడ్డుమీద కంకర అంతా పోవడం డోరియా రావటం జరుగుతుంది. కావున ప్రభుత్వము రోడ్లను వేసేటప్పుడు, ప్రజల ముఖ్యమైన అవసరాలను గుర్తించడంలేదు అని నా విమర్శ. విజయవాడనుంచి బుసన్నపేటకు 25 మైళ్లు direct road కు ఎస్టిమేటు వేయడం జరిగింది. 52 సంవత్సరంలో కరువువచ్చినప్పుడు దీనిని ప్రారంభించుతున్నామన్నారు, కరువు పనులు చూపించుటకు. కాని జిల్లా బోర్డు ప్రభుత్వాన్ని అప్పు అడిగింది. దీనిని శాంక్షన్ చేశారు. ఇంతవరకు దానివిషయ మేమైనదో తెలియదు. రెండు సంవత్సరములైనా పని ప్రారంభించలేదు. ఈ రోడ్డు పని పూర్తికానందువలన, ఇప్పుడు బుసన్నపేటనుండి బెజవాడకు పోవలసివస్తే, 50 మైళ్లు చుట్టు తిరిగిపోవలసి యుంటుంది. దగ్గరగా 25 మైళ్లలో పోగలిగే అవకాశమున్నప్పుడు. ఈరోడ్డు పూర్తి చేయకపోయినందున 50 మైళ్ళు తిరిగిపోవలసి వస్తుంది. ఈ విధంగా శాంక్షన్ చేసిన పనులనుకూడ పూర్తిచేయకుండా ఉన్నదంటే, ప్రభుత్వము ప్రజల అవసరా

లను ఏ విధంగా చూస్తున్నదో అర్థం చేసుకోవచ్చు. అసలు ప్రజల కనీస అవసరాలకు కావలసిన రోడ్లు సరిగాఉంటే, తరువాత సిమెంటు వేసేపని చూసుకోవచ్చును. ఆ విధంగా ప్రజలకు అవసరమైన రోడ్లపనులకు ఈ డబ్బు ఉపయోగించకుండా ఎక్కడో సిమెంటురోడ్లు వేయడానికని, గవర్నరుగారికి Guest House కట్టడానికని, బంగళాల మరామత్తుకని ఇతర కార్యక్రమాలకని అనవసరమైన ఖర్చులు చేయడం సరియైనటువంటి విధానం కాదు. ఇటువంటి అనవసరపు ఖర్చులు తగ్గించి నట్లయితే, ఉన్న రోడ్లకు సరిగా మరమ్మత్తు చేయడానికి, ప్రజలకు కావలసిన కొత్తరోడ్లు వేయడానికి అవకాశ ముంటుందని ఆ విధంగా చేయాలని చెపుతూ నేను యీసవరణను బలపరుస్తున్నాను.

* Sri K. ADIKESAVULU NAIDU :— అధ్యక్షా, ఈ Civil Works Demand ను బలపరుస్తున్నాను. ఈనాడు పరిస్థితు లను బట్టిచూడగా, మన రాష్ట్రములో రోడ్లమీద traffic ఎక్కువ అయిపోయింది. అంటే రోడ్లమీద traffic ఎక్కువ అయినప్పటి కిని allotment మాత్రం చాలా తక్కువగా ఉన్నదని కనబడుతున్నది. రాయలసీమలో కరువు పనులద్వారా రోడ్లు ఎక్కువగా నిర్మించబడ్డవి. రాయలసీమలోని రోడ్లపరిస్థితి చూస్తే, యీ కొత్తరోడ్లు వేయకుండా వుంటేనే బాగుంటుంది అనిపిస్తున్నది. ఈనాడు వేసిన రోడ్లమీద గుం టలు, గోతులు ఎక్కువగా కన్పిస్తున్నవి. బండ్లుగాని, మనుష్యులుగాని ఈ రోడ్లమీద ప్రయాణము చేయుటకు కష్టతరముగావున్నది. ఈ రోడ్లు చాలామటుకు జిల్లాబోర్డులద్వారా నిర్మింపబడినవి. కొత్తరోడ్లు నిర్మించు నప్పుడు పాతరోడ్లు సరిగా maintain కాబడడము లేదు. ఈ పాత రోడ్లను సరియైన స్థితిలో ఉంచడము విస్మరించబడుతున్నది. ఈ పరిస్థితి యీవిధంగా ఉన్నదని చెప్పడం నా స్వానుభవమువల్ల తెలుసుకొని చెప్పవలసి వచ్చింది. జిల్లాబోర్డులు వేసినటువంటి రోడ్లు చాలాభాగము అసంపూర్తిగా నిలబడిపోయినవి. ఇంకా ఎంతోభాగము పూర్తిచేయ వలసి వున్నది. కొన్ని కంకరవేయకుండా మట్టిరోడ్లుగానే వున్నవి. కొత్తరోడ్లు వేశారుకాని, వాటిల్లో గుంటలు, గండ్లు పూర్తిగావున్నవి. ఈ రోడ్లనన్ని పూర్తిచేయుటకు ప్రభుత్వము యోచనచేసి, యీ బడ్జె టులో కొంత provision చూపించి బాగుచేయించవలసిన అవసరము యెంతైనా వున్నది. మట్టిరోడ్లు మట్టిరోడ్లుగానే వున్నవి. ఒకదానికి

గూడా తారు వేయడము అన్నమాట లేదు. ప్రభుత్వం యీ విషయంలో ప్రత్యేక శ్రద్ధవహిస్తేనే గాని, యీ రోడ్లు బాగుపడవు. Traffic కు సులభతరము కానేరదు. హిస్టరీలో అశోకుని కాలములో రోడ్లప్రక్కన చెట్లు నాటినసంగతి జ్ఞాపకము వస్తున్నది. ఆ కాలమునుంచి రోడ్లమీద ప్రయాణము చేయటానికి • ఎన్నో చెట్లునాటి సదుపాయాలు కల్పించి యున్నారు. ఆ చెట్లు యెంతో ఆదాయంనిస్తూ, ప్రయాణీకులకు మంచి నీడనుగూడయిస్తూవున్నవి. చెట్లుగూడా ప్రభుత్వానికి మంచి ఆదాయము నిచ్చుచుండేవి. ఈనాడు చూడగా, ఈ చెట్లు అన్నియు public property గా ప్రజలు చూస్తున్నారు. ప్రజలకు యిందులో ఏదో వ్యక్తిగత హక్కువుందని తలంచుచున్నారు. ఈ చెట్లు అన్ని కొట్టివేసి ప్రజలు నాశనము చేస్తున్నారు. ఈ చెట్లు అన్ని ప్రజలకొరకే స్వంతాన ఉపయోగించుకొనటానికి వేయబడినట్లు ప్రజలు తలంచుచున్నారు. చాలా భాగము చింతచెట్లు యుంటూవచ్చినవి. అటువంటివి ఈనాడు ఒకచెట్టు కనబడదు. ఈ చెట్లనుండి చింతపండు ద్వారా ఆదాయము వచ్చుచుండేది. చింతపండుగాని, కాయలుగాని కొంచెముగూడ ప్రభుత్వమునకు చెందకుండా ఆదాయమురానివ్వకుండా ప్రజలుఅపహరించుచున్నారు. ఈరోజులలో చింతపండు కొరతవల్ల ఖరీదు ఎక్కువఅయింది. ఈ చెట్లు వంటచెరకు కొరకు ప్రజలు కొట్టుకొని పోతున్నారు. ప్రభుత్వము కొత్తగా చింతటువంటి చెట్లు పోరంబోకులలో నాటమని ఉత్తరువులు యిస్తున్నారు. రోడ్ ప్రక్కన వేస్తే, ప్రభుత్వమునకు ఆదాయమే కాకుండా, ప్రజలకు ఎంతో ఉపయోగముగా నుండును. ఈ విషయములో ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధవహించి, ప్రత్యేకంగా సిబ్బందిని ఏర్పాటుచేసి, ఈ చెట్లకు దుర్వినియోగమునకు గురికాకుండా కాపాడవలసి యున్నది. ఈ విధంగా యింతవరకు ఈ చెట్లు దుర్వినియోగము అయినందువల్ల National wealth ఎంతో తగ్గిపోయింది. ఈ రోడ్లను కాపాడే బాధ్యత ప్రభుత్వముమీద యున్నది. రోడ్లమీద నిర్మించబడిన వంతెనలు చాలాభాగము P. W. D. వారి ఆధీనములో వున్నవి. అందువల్ల జిల్లాబోర్డులకే కాకుండా P. W. D. వారికిగూడా అజ్మాయిషి అధికారము వుంటున్నది. ఉదహరణకు మా చిత్తూరు జిల్లాలో దామలచెరువు గ్రామమునుంచి వెళ్ళే రోడ్డులో నాలుగు వంతెనలకు

అమర్చవలసిన సుమారు రెండువేల రూపాయలు ఖరీదుచేసే ఇనుప కమ్ములు ఇవ్వనందువల్ల పని పూర్తికావడం నిలచిపోయినది. ప్రభుత్వం ఈ వంతెనలు పూర్తిచేయటానికి అయిదేండ్లు అలస్యము ఎందుకు చేయాలి ? దీనికి బాధ్యులెవరు అనేవిషయము దర్యాప్తు చేయాల్సి వున్నది. ఈ రోడ్ల విషయములో ఎంతో అశ్రద్ధ జరుగుచున్నది. ప్రభుత్వం యీ విషయంలో తగు శ్రద్ధవహించి, చర్య తీసుకోవలసినదిగా కోరుచూ యింతటితో విరమిస్తున్నాను.

Sri R. SIDDANNA GOWD:—అధ్యక్షా, ఈ డిమాండు క్రింద national high ways ఖర్చులు, provincial highways ఖర్చులు, జిల్లాబోర్డు major roads ఖర్చులు, అన్నిటిని గురించి మన డిప్యూటి ముఖ్యమంత్రిగారు శెలవిచ్చారు. మా తాలూకాలో అమరాపురం అనేగ్రామం వున్నది. తక్కిన సభ్యులకు తెలియక పోయినప్పటికిని డెప్యూటీ ముఖ్యమంత్రిగారికి తెలుసును. అమరాపురంనుంచి హిందూపురమువరకు సుమారు 47 మైళ్ళు పొడువు రోడ్డు వున్నది. ఇది highest traffic గల రోడ్డుగా వుంటున్నది. బండ్లమీద టోల్సు వసూలు చేయుచున్నపుడు, వచ్చే ఆదాయము యేరోడ్డుమీద వసూవులవలేదు. ఇటువంటి గొప్ప traffic, ఆదాయమువచ్చే రోడ్డును major roads లో చేర్చబడలేదు. గవర్నమెంటు స్వాధీనములో పెట్టుకొని ఎక్కువ సదుపాయాలు ఏర్పాటుచేయటానికి బదులు, జిల్లాబోర్డు ఆధీనములోనే వుంచారు. ఇప్పుడు యీరోడ్డు చాలా చెడిపోయింది. మరమ్మతులుగూడా లేవు. ఇట్టి పరిస్థితులలో ఈరోడ్డును ప్రభుత్వము స్వాధీనములోనికి తీసుకొని major road క్రిందకు తీసుకొనవలసిందని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. మా తాలూకాను మరొకసారి పర్యటించి, ఆ ప్రాంతపు పరిస్థితులను పరిశీలించి విద్యుచ్ఛక్తి సరఫరా ఆ ప్రాంతాలకు చేయిస్తానని శ్రీ సంజీవరెడ్డిగారు, విద్యుచ్ఛక్తి సరఫరా గురించి మాట్లాడే సందర్భములో చెప్పారు. వారు అట్లా చెప్పారంటే అక్కడి ప్రజలనుగాని, నన్నుగాని మభ్యపెట్టటానికి కాదని, నేను నమ్ముతున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI:— నేను పూర్తి అభిమానముతో, మడకసిర తాలూకాకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయి

Sri N. Sanjeeva Reddi [15th March 1954

స్థానని చెప్పాను గాని, మైసూరు ప్రభుత్వముమీాద అభిమానముతో చెప్ప లేదు.

Sri R. SIDDANNA GOWD:— If that is so, I stand corrected. మా మడకసిర ఠానులో హైస్కూలు రోడ్డుకు ఆనుకొని వున్నది. మరియు సదరురోడ్డు built up area మధ్యనున్నది. రాకపోకలు విశేషంగా వున్నవి. ఈ bus traffic వల్ల రోడ్డుమీాద దుమ్ము మేఘాలుగా తయారై ప్రజల ఆరోగ్యానికి భంగంకలుగ జేస్తున్నది. ముఖ్యంగా అక్కడ చదువుకునే విద్యార్థులకు ఈ దుమ్ము చాలా అనారోగ్యము కలిగించుచున్నది. అందువల్ల ఈ రోడ్డును black tap road క్రింద తయారుచేయించాలని కోరుతున్నాను. ప్రభుత్వము ఈ విషయములో ప్రత్యేకశ్రద్ధ వహిస్తారని తలంచుచున్నాను. అంతేకాకుండా, మా జిల్లాబోర్డు చాలా అధ్వాన్నస్థితిలో వున్నది. దాని రికార్డులను మంత్రిగారు వీక్షించినట్లయితే, దాని బండారములు బయట పడగలవు. ఒకటి రెండు సంవత్సరాలుగా అక్కడి రోడ్లు చాలా చెడిపోయినవి. జిల్లాబోర్డు వ్యవహారాలుగూడా అదేస్థితిలో వున్నవి. village roads పంచవర్ష ప్రణాళికలో చేర్పించి, ఇండియా గవర్నమెంటువారు యిచ్చేటటువంటి డబ్బుతో ఆ రోడ్లు బాగుచేయించమంటున్నారు. మా తాలూకా రోడ్లను అందులోకి తీసుకోబడలేదు. అక్కడ రెండు రూట్సులో బస్సులు పోతున్నవి. ఈ రోడ్లను పంచవర్ష ప్రణాళికలో చేర్పించి ఇండియా గవర్నమెంటు యిచ్చే డబ్బు యిక్కడి ప్రభుత్వం యిచ్చే డబ్బుఅంతా చేర్చి యీ రోడ్లను pucca roads గా తయారు చేయించవలసిందిగా కోరుతున్నాను. మైసూరు మా తాలూకాకు దగ్గరగా వున్నది గనుక, బస్సు traffic గూడా మెండుగా వుంటున్నది. రాకపోకలకు యీ బస్సులు వుపయోగముగా వున్నవి కాబట్టి రోడ్లను శీఘ్రంగా బాగు చేయించవలసిందని మనవిచేస్తున్నాను. అక్కడ అనేక రోడ్లు వేశారు. ఆరోడ్లు ఏ స్కీముక్రింద వేశారో, ఆఆఫీసర్లకు డబ్బు ఎక్కడినుంచి వచ్చిందో నాకు తెలియదు. మా ప్రాంతాలలో ఏ రోడ్డుకుగూడా సదుపాయాలు ఏర్పాటు చేయబడలేదు. మా తాలూకా చాలా వెనుకబడిన తాలూకా అయియున్నది. ఆ తాలూకాకు సరిగా డబ్బు ఖర్చుచేయడం లేదు. మాతాలూకా విషయములో ఇండియా ప్రభుత్వమువారు ఏర్పరచిన 5 year plan క్రింద ఒక programme వేసుకొని అక్కడి

15th March 1954] [Sri D. Siddanna Gowd

రోడ్లకొరకు క్రమేణ డబ్బు ఖర్చుచేస్తూవస్తే, ఆ తాలూకాలోవున్న రోడ్లు అన్నియు బాగుపడగలవని ఆశిస్తూ, ప్రభుత్వమును తగుమైన శ్రద్ధవహించమనికోరుతూ, విరమిస్తున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU:— అధ్యక్షా, ఈ electricity డిమాండుకు చాలా ముఖ్యమైంది. కాని దీన్నిగురించిన చర్చ త్వరలో ముగించవలసివస్తున్నది. అయినను, నేను కొన్ని విషయాలు మనవిచేయ దలచుకున్నాను. మంత్రిగారికి సమాధానము చెప్పటానికిగూడా తేలికగా వచ్చింది. నా మిత్రుడు రామారావు గారు కొంతవరకు చెప్పారు.

ఈ డిమాండులో పొందుపరచిన పద్దులుచూస్తే, గవర్నరుగారి భవనాలక్రింద చాలా ఖర్చు ప్రభుత్వం పెట్టదలచింది. ముఖ్యంగా civil works క్రింద 6.90 లక్షలు ఒక గవర్నమెంటు అతిధిభవనము క్రింద ఖర్చుపెట్టబోతున్నారు. మన రాష్ట్రములోని రోడ్లు, హాస్పిటల్సు, విద్యాసంస్థలు, వీటిక్రింద చాలినంత ద్రవ్యము ప్రభుత్వము ఖర్చుపెట్టటం లేదు. పైగా ఒక్క గవర్నమెంటు అతిధిగృహానికే యీ 6, 7 లక్షల వరకు ఖర్చుపెట్టేబదులు, అతిధులు వచ్చినప్పుడు ప్రకాశం పంతులుగారి బంగళాలోనో, సంజీవరెడ్డిగారి బంగళాలోనో వారికి ఏర్పాటు చేయ కూడదా అని అంటున్నాను. ముఖ్యమైన పనులు ఎన్నో ప్రభుత్వము చేయవలసివున్నవి. కాబట్టి యీ 7 లక్షలు వాటి క్రింద ఖర్చుచేస్తే బాగుండదా? ఆ విధంగా చేస్తే ప్రజలకు మరికొన్ని ప్రయోజనకరమగు సౌకర్యాలు చేయటానికి వీలవుతుందిగదా! రాష్ట్రములో Buildings సరియైనవి లేకుండా ఎన్నో హాస్పిటల్సు వున్నవి. Famine works క్రింద ప్రభుత్వము చాలినంత ఖర్చుచేయడము లేదు. అలాంటి పరిస్థితులలో యీ Guest House క్రింద యింత పెద్ద మొత్తము ఖర్చు చేయడములో అర్థములేదు. ఇదంతా అనవసరమైన ఖర్చేనని నా అభిప్రాయము.

గవర్నరుగారికి వేసవికాలములో నివాసగృహము విశాఖపట్టణములో యేర్పాటుచేయటానికి ప్రభుత్వము అక్కడ ఒక building కట్టించ దలపెట్టింది. గవర్నరుగారు వేసవికాలములో మన ఎండ

15th March 1954] [Sri Pillalamarri Venkateswarlu

తట్టుకోలేకపోతే, విశాఖపట్టణములో ఉండేబదులు, వారు ఏ గుజరాత్ లోనో ఉండిరాకూడదా ?, ఈ కొద్దికాలపు వసతికి యింతడబ్బు ఖర్చు చేయడము మంచిదికాదు.' వారు వేసవికాలములో గుజరాత్ లో ఉంటేనే బాగుంటుందని నా అభిప్రాయము. ఇదంతా లెక్కవేసి చూస్తే ఒక్క గవర్నరుగారికొరకు సుమారు 11 లక్షలు ఖర్చుచేయబడుతున్నది.

The Hon. Sri T. VISWANATHAM:— ఈ డిమాండు క్రింద కాదు.

Sri PILLALAMARRI VENKATESWARLU :— అందువల్ల ఈ ఖర్చు కొంతవరకు తగ్గిస్తే బాగుంటుంది. ఇంకా యీ డిమాండులో చూస్తే, Civil Works క్రింద 50 లక్షలు ఖర్చుచూపించుచున్నారు. ఈ minor works క్రింద యింతసొమ్ము ఎందుకో అర్థం కావడంలేదు. General Administration పద్దుక్రింద ఎంతచూపించారో చూడాలి.

ఈ డిమాండులో 6 లక్షల పైచిల్లర minor works క్రింద ఖర్చుచేయబోతున్నారు. 10 వేలు ఖర్చుచేస్తే చాలుననుకుంటాను. నాకు టైము యిస్తే, దానివిషయం పరిశీలించి చెప్పగలను. ఈ విధంగా ప్రతిఒక్కపద్దు చూడవలసిఉంటుంది. దానికి accounts కూడా యిక్కడ కనబరచలేదు. అందువల్ల ఏ ఏ పద్దుక్రింద ఎంతెంత ఖర్చు పెట్టబోతున్నారో చూడాలి. అయినను ఈ చిన్న items క్రింద యింత ఖర్చుచేయడం అనవసరమంటాను. ఇందులో సొమ్ము కొంత మట్టుకు రోడ్లకొరకు ఖర్చుచేస్తే, కొంతవరకు డబ్బుమిగిలే అవకాశాలు ఉండవచ్చు.

ఈ worksలో చాలా భాగము పెద్ద పెద్ద కంట్రాక్టరకు ప్రభుత్వం అప్పచెప్పుచున్నది. పెద్ద contractors కు ప్రతి చిన్న పని యిస్తే, వాళ్ళు మోసముచేసి కాజేయటానికి అవకాశాలువుంటవి. ఈ చిన్న పనులు ప్రభుత్వోద్యోగుల అజ్మాయిషిలో జరిపిస్తేనే బాగుంటుంది. ప్రభుత్వానికి ఎంతోడబ్బు మిగులుతుంది. క్రిష్ణా రెగ్యులేటరుబ్రిడ్జి పెద్ద కంట్రాక్టరుకు యివ్వబోతున్నారు. ఒకరికే అంతాయిచ్చేబదులు చిన్న చిన్న భాగాలుగాచేసి, కొంతమంది కంట్రాక్టరులకు యిస్తే, వారు మోసము

చేయటానికి వీలుండదు. ప్రభుత్వానికి ఎంతో డబ్బు మిగులుతుంది. పని కూడా లాభసాటిగా జరుగుతుంది. దుబారా ఉండదు,

ఇక్కడ కర్నూలులో irrigation works అనేకములున్నవి. ఈ పనులలో డబ్బు దుబారాకాకుండా చూడాలి. అందులో కొంత సొమ్ము మిగల్చటానికి అవకాశముండగలదు ఈ పనులు contractors కు యివ్వకుండా ప్రభుత్వమే జరిపించాలని చెబుతున్నాను. సమయము చాలనందున యింతటితో ముగిస్తున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI:— అధ్యక్షా, శ్రీ రామారావుగారు కొన్ని విషయాలు ముఖ్యమైనవి చెప్పారు. రోడ్లు కావలసినన్ని లేవని, తిరువూరులో రోడ్లు అధ్వాన్నంగా వున్నాయని చెప్పారు. నేనుకూడా యీ మధ్య అక్కడకు వెళ్లినపుడు చూచి వచ్చాను. అసలు రాష్ట్రంలోనే రోడ్ల పరిస్థితి తృప్తికరంగా లేదు. ఒక్క తిరువూరే కాదు. అన్ని రోడ్లు ఆ విధంగానే రాష్ట్రమంతటకూడ తృప్తికరంగా లేవని నేను అంగీకరిస్తున్నాను. ఆ రోడ్లకు పూర్వము ఖర్చుపెట్టినట్లుగానే, యిప్పుడుకూడా ఖర్చు పెడుతున్నాము. అదికాకుండా యిదివరకుకన్న యిప్పుడు vehicular traffic హెచ్చైయినది. రోడ్లను increase చేయుటం మాట అలాగున వుంచి, అసలు వున్నరోడ్ల మరమ్మతుకే యెక్కువగా ఖర్చుపెడుతున్నాము. కాని, యిదివరకుకన్న యిప్పుడు material, labour యొక్క cost చాలా హెచ్చు అయినది. Labour cost విపరీతంగా హెచ్చింది. పూర్వము యెన్నో కొన్ని వేల రూపాయలతో రోడ్డును వేయగల్గినా, యిప్పుడుఅంత రోడ్డునే కొన్ని లక్షల రూపాయలు ఖర్చు చేస్తున్నా వేయలేక పోతున్నామంటే, దానికి కారణంముఖ్యంగాlabour cost హెచ్చిందన్నమాట. ఇదివరకుకన్న డబ్బు హెచ్చుగా ఖర్చుచేస్తున్నాము కాని, రోడ్లుమాత్రం improve కాలేదు. ఈ రోడ్లకుపెట్టే ఖర్చు విషయంలో కొంత దుబారా ఖర్చు అవుతున్నదని శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు చెప్పినది నేనుకూడా అంగీకరిస్తున్నాను. అయితే, ఆ విధంగా దుబారా అయ్యేఖర్చును యెట్లా save చేయాలన్నదే నాకు కష్టంగావుంది. ఈ విషయంలో నేను శ్రీ విశ్వనాథంగారు మాట్లాడు కొంటూటాము. అసలు general గా ప్రభు

Sri N. Sanjeeva Reddi] [15th March 1954

త్వము పెడుతున్న ఖర్చులలో దుబారా ఖర్చులను తగ్గించి కొంత మొత్తం saveచేసే విషయం ఆలోచిస్తూంటాము. ఎక్కువ దుబారా ఖర్చు అవుతున్నదనే వారు కూడా, డబ్బు save చేయడానికి మార్గాలను సూచిస్తేనే మంచిదికాని, లేనిమొడల యెక్కువ ఖర్చు అవుతున్నదని vagueగా చెప్పడం యేమిలాభం. అయితే యీ విషయంలో ఒక మార్గానికి యెట్లా రాగలుగుతామన్నదే ప్రశ్న. ఎక్కడో అవుతున్న wastage ని గురించి చెప్పేటప్పుడు, అసలు system నే rectify చేయడంలో మార్గం సూచిస్తే బాగుంటుంది. ఎక్కడో జరిగినటువంటి కొన్ని cases ను చెప్పితే. దానికి సంబంధించిన విషయాలు సమగ్రంగా చెప్పకపోతే, దానిని గురించి action తీసుకోవడం ఎట్లా, అందుచేత, అసలు యీ system నే మార్చి, యీ wastage ని అరికట్టడానికి మార్గాలు యేమిటో ఆలోచించాలి. అంతేకాని, యెవరో కొందరు వుద్యోగులు తప్పుచేశారు, శిక్షించేయాలి అంటే, యీsystem improve అయేది కాదు. ఈ system నే మార్చాలని మేము దీర్ఘంగా ఆలోచిస్తున్నాము. అందుచేత, అనుభవము వున్నవారు constructive and concrete suggestions యిస్తే, వాటిని స్వీకరించి తప్పకుండా మేము ఆలోచిస్తాము.

పోతే, యిక గవర్నరు యింటిని గురించి, దానికి అయ్యేఖర్చులను గురించి, కొంతమంది మిత్రులు బ్రహ్మాండంగా చెప్పారు. అసలు నిజం చెప్పుకోవలసివస్తే, మన ఆంధ్రరాష్ట్ర గవర్నరుగారి భవనము, మిగతా రాష్ట్ర గవర్నరుల పెద్దపెద్ద బంగళాలవలె గాక, ఎంతో చాల simple గా వుంది. ఆయన office బొత్తిగా రెండు జానలువుంది. Hostel roomలో సగము వుంది. మన గవర్నరుగారి office room, ఆయన యిల్లు చాలా చిన్నవి. యింతకు పూర్వం Executive Engineer వుండే యింటిని, మనం రాజభవనం అని చెప్పాము. అందువల్ల, యీ building గవర్నరు dignity కి, హోదాకు తగినట్లుగా లేనేలేదు. వారు పెద్ద status లోను, dignity లోను వున్నారు కనుక, naturally గా వారి భవనము యెట్లావుండాలి? కాబట్టి, మనం ఆయన మర్యాదకు తగినట్లుగా ఒక చక్కటి భవనం యిచ్చివుండవలసినది. కాని వారు ఆ చిన్న యింటిలో office

15th March 1954] [Sri N. Sanjeeva Reddi

గదులు లేకుండా యేళ్ళకాలం గడుపుతున్నారు. అందువల్ల వారికి కావలసిన కొన్ని పెద్ద office గదులకై, యిప్పటి యింటిని extend చేసి, additional rooms ను వేస్తున్నాము. మిగిలిన రాష్ట్రాలలో వలె పేరుకు గవర్నరు భవనము (రాజభవనము) అనేకాని, పెద్ద మొత్తాలను ఖర్చుపెట్టటంలేదు.

ఇక State guest house విషయం చూస్తే, ఇక్కడ ఒక రిద్దరికన్న యెక్కువగా guests దిగడానికి వీలులేకుండా పోతున్నది. Madras State Guest House చూడండి. ఇతర countries నుండి యెవరైనా వచ్చినయిట్లతే గవర్నరుకు guests గా వచ్చినా, వారు status ను బట్టి గవర్నరు యింట్లో దిగుతూంటారు. వారిని మర్యాద చేయవలసి వుందనే ఉద్దేశ్యముతో చేస్తున్నాము. Government యింటిలో యింకా రెండుగదులు కట్టబడియితే, గవర్నరుగారు మాటిమాటికి అయా యీ rooms యేమైనా ఇచ్చుకొని పోతారా? మన State మర్యాదకు తగినట్లుగా, వారికి వ్యక్తిగతమర్యాదగు తగినట్లుగా చేస్తున్నాము. మన State గవర్నరు, మన State అనే భావంతో, మర్యాదతోను ఆ ఖర్చులను పెట్టాలికాని, సంకుచిత భావంతో చూడరాదని నేను చెబుతున్నాను.

ఇక సిద్ధన్నగౌడుగారు అమరాపురం రోడ్డును గురించి చెప్పారు. నేనుకూడా వాటిని యిదివరలో చూచాను. ఈమధ్య 7, 8 మాసాల మధ్య వాటిని చూచే అవకాశము కలుగలేదు. సిద్ధన్నగౌడు గారు చెప్పినటువంటి విషయాలను నేను అంగీకరిస్తున్నాను. మిగిలిన రోడ్లలాగు అమరాపురం రోడ్డునుగురించి వారు చెప్పారు. దాని విషయంలో తీసుకోవలసిన చర్య తీసుకుంటాము. ఆదికేశవులు నాయుడు గారికి వున్న అనుభవము నాకూ వున్నది. నేను చిత్తూరు జిల్లాకు elections కు పోయినప్పుడు వారు చెప్పిన రోడ్లు నాకు కనబడ్డాయి. ఆ రోడ్లు యెప్పుడో పూర్వం వేశారట. అలాంటిరోడ్లు చాలావున్నాయి. చిత్తూరు జిల్లాబోర్డువారిని అందుకు నేను ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. వారు రోడ్లు చాలా వేశారు. కాని, తదుపరి రోడ్లకు repairs జరుగ లేదు. చిత్తూరు జిల్లాలో lorry, heavy vehicular traffic యెక్కు-

Sri N. Sanjeeva Reddi] [15th March 1954

వగా వున్నది. అందుకుగాను వాటిని urgent గా rep.ir చేయవలసి వస్తోంది. రాష్ట్రంమీాద అప్పు, చిత్తూరు జిల్లాబోర్డువారు కోరుతున్నారు. మిగిలిన జిల్లాబోర్డులకు గవర్నమెంటు sanction అవసరంలేదు. గవర్నమెంటు అప్పుయివ్వకపోయినా, వారికి అవసరంలేదు. చిత్తూరు జిల్లా బోర్డు ప్రతి గ్రామంలోను అనుగడుక్కు రోడ్లను వేశారు. అన్నీ special sanction తో అక్కడ రోడ్లువేశారు. ఆ రోడ్లను గవర్నమెంటు తీసుకోవాలంటే అది వీలయ్యేపనికాదు. రాష్ట్రంలో అన్ని జిల్లా బోర్డుల రోడ్లను గవర్నమెంటు తీసుకొని, బాగుచేయాలంటే, అదిసాధ్యమౌతుందా అంటే, యేమీా జరుగదు, జరిగేదికాదు. ఇవ్వవలసిన అప్పులను తీర్చలేకుండా వున్నారు.

ప్రభుత్వం ఎన్నిలక్షలు యిచ్చినా, అప్పులుతీర్చే సందర్భం కనిపించడంలేదు. కొంతకాలం తరవాత ఈ జిల్లాబోర్డుల రోడ్లను ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటే అది బాగుపడచ్చు. ఇప్పుడు expenses కి 50 వేలు అవుతుందా? అన్నారు. White washing క్రింద, రంగులు వేయడంక్రిందే 50 వేలు పోతాయి. ఇంత పెద్దరాష్ట్రానికి 50 వేలు రూపాయలు ఒక పెద్ద మొత్తంకాదు. దీన్నిమీారు దయచేసి ఏకగ్రీవంగా ఆమోదించాలని కోరుతున్నాను.

Mr. SPEAKER :— I am now putting the cut motion to the vote of the House. The question is :

"To reduce the allotment of Rs. 2,92,17,100 under Demand XXIV-Civil Works - Works by Rs. 100."

The motion was lost.

Mr. SPEARER :— The question is :

"That the Government be granted a sum not exceeding Rs. 2,92,17,100 under Demand XXIV- Civil Works-Works."

The Motion was carried and the grant was made.

The House adjourned for the day to meet again at 8-30 A. M. on Wednesday, the 17th March 1954.